శ్రీమతే రామానుజాయనమః

# అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము,

తృతీయాశ్వాస పద్యకావ్యము



గ్రంథకర్తలు

నల్లంతిఘళ్ చక్రవర్తుల

ఠంయాల లక్ష్మీనృసింహాచార్యులవారు



ప్రకాశకులు

కటకం నరసయ్య, వీరన్న గార్లు

 [దీనివెల రు ౧



నల్లంతిఘుళ్ చక్రవర్తుల
రంయాల లక్ష్మీనృసింహాచార్యులవారు
గ్రంథకర్త.

# తొలి పలుకు



అభినవ రూపశేఖరులారా!

ఈ ప్రబంధమిప్పటి కిరువదైదు వత్సరముల క్రిందటనే నెరవేరెను. కావ్యరచన కిదియే నూతనప్రవృత్త్యగుటచే, (ప్రమాదో ధీమతామపి) యను న్యాయానుసారము, ప్రమాదములుండు ననుసంశయంబున ప్రచురింప నిచ్ఛబొడమకుండెను. క్రమక్రమముగా ఇంక కొన్ని గ్రంథములు విరచింపగలిగినందులకు మిత్రులెందరో యీ గ్రంథముద్రణకై ప్రోత్సాహమొనరించిరి. సవరింపులు కానందున గ్రంథముద్రాణానుకూల ద్రవ్యాభావంబున కాలవిళంబమయ్యెను. నా కాలంబున పండితపుంగవులీ పొత్తమును వీక్షించి ముద్రణప్రయత్న ప్రోత్సాహమొనరించిరి. వారి వాగ్రమ తప్పనిదై అట్టి తరుణంబుననే ముద్రణద్రవ్యం బొసంగెదమని కటకం నృసింహ వీరనశెట్టులు, నాగ్దానమొసర్చిరికాని నాగృహపరిస్థితులచే వత్సరద్వయకాలంబతీతమైనది. అది మొదలీవరకు మరలి కావ్యమును ముద్రణస్థితిలోనికిఁ దెచ్చి ముద్రింపగలిగితిమి.

ముద్రణసమయమున మేము స్థానాంతరస్థితులమగుటచే సవరణ బహుళ్యమైనను ముద్రణస్ఖాలిత్యము లుండునగాన పాఠకులు యథామతిగ సంప్రతించు కొనప్రార్థితులు.

ఇట్లు విన్నవించునది
గ్రంథకర్త, నివాసస్థానము
ఓరుఁగల్లు.

# పీ ఠి క

శ్లో॥ అపారేకావ్యసంసారే । కవిరేకః ప్రజాపతిః ।
యథాస్మైరోచతే విశ్వం । తథేదంపరికల్ప్యతే ॥

రసికవతంసులారా,

కావ్యప్రపంచము నిరవధికమైనది. కవి తనమనశ్శక్తి ననుసరించి కవితాశిల్పకళ నుపదేశించును. కవీంద్రుఁడు తన మనోరథము ననుసరించి విధాతవలెఁ గావ్యప్రపంచము నిర్మించును. కవులకల్పనాశక్తి ప్రతిభాతరంగముల నూగులాడుచుండును.

శ్లో॥ శృంగారీ చేత్కవిఃకావ్యే । జాతం రసమయంజగత్ ।
సచేత్కవిర్వీతరాగో । నీరసంవ్యక్తమేనతత్ ॥

కవి శృంగారరస పరతంత్రుఁడైన కావ్యములుగూడ శృంగార ప్రవంతి నవగాహన మొనర్చుచుండును. కవి విరాగియైనచోఁ గావ్యములుగూడ నీరసముగా నుండును. నీరసముగా నుండు కావ్యములు సహృదయహృదయరంజకములు కానేరవు. చమత్కృతిరహితములగు కావ్యములు తృణపురుషసదృశములు.

పాఠకులకు హృదయానందము నొసంగి నీతిని బోధించునవియే యుత్తమకావ్యములు. ఏ విధముగనైనను సుకుమారమతులకు నీతిని బోధించుటయే కావ్యరచనా ప్రయోజనము.

దృశ్యములనియు, శ్రవ్యములనియు, కావ్యములు రెండువిధములు. నటకులచేత రంగస్థలమునందు ప్రదర్శింపఁదగినవి దృశ్యములు. వినఁదగినవై ప్రదర్శనానర్హములై వెలయు పురాణములు, ప్రబంధములు, శ్రవ్యకావ్యములు ఇవి పండితుల పాండితీచాతురికి నికషోపలములు. అష్టాదశవర్ణనా సహితములగు కావ్యములు మహాకావ్యకక్ష్య నధిరోహించును.

ఆంధ్రభాషాయోషకు భాషాంతరీకరణమున నిరుపమానసామ ర్థ్యము గలిగిన కవిత్రయము పెట్టినదే యాదిభిక్ష. ప్రబంధపరమేశ్వ రబిరుదంబు ధరించిన ఎఱ్ఱాప్రెగ్గడవంటి కవు లనేకు లది మొదలుకొని తమ కవితాకన్యకకు ప్రబంధడోలికలఁ గూడా నయ్యాలలూపుటకై గల చూపసాగిరి. కూచిమంచి తిమ్మకవి మొదలగు కవీంద్రులు మిశ్ర ప్రబంధములనే గాక యచ్చ తెనుఁగు ప్రబంధముల సహితము రచించి యశశ్శాలులైరి. పురాతన కవి తిలకుల యాశీర్వాదనే, వారిదయా రసమే, యధునాతన కవిశేఖరులకాలంబనము; ఆంధ్రభాషాలలా మకు జీవగఱ్ఱ.

మిశ్రబంధరచనకన్న, నచ్చ తెనుగు పలుకుబడులచే చిత్రిత మగు కావ్యరచన, మిక్కిలి కష్టము. కావుననే నంతర్వాణీంద్రులకది సరస్వతీ పీఠము.

## గ్రంథకర్తృ ప్రశంస.

అచ్చ తెలుఁగు ప్రబంధమగు నీ కుబ్జాకృష్ణవిలాసమును రచించిన కవినాథులు శ్రీమాన్ స్నల్లంతిఘల్ చక్రవర్తుల, రంయ్యాల, లక్ష్మీ నృసింహాచార్యులవారు, వీరికి, రంయ్యాలయని, బిరుదనామము. వీరి నివాసము, వరంగల్లు. గోత్రము, హారితసగోత్రము. జనకుఁడు రంగా చార్యులవారు. వీరు వేల్పుగొండ లక్ష్మీనృసింహస్వామి కరుణాకటాక్ష లబ్ధవాగ్విభవానుభావులు, ఆంధ్రభాషాప్రవీణులు, చతుర్విధకవితా ప్రబంధరచనా నిర్మాణధురీణులు. ఈ విషయమంతయు నాశ్వాసాంత గద్యవలన స్ఫుటమగుచున్నది. వీరీ యచ్చ తెనుఁగు ప్రబంధమునే కాక నిరోష్ఠ్యాద్యేతర గ్రంథములనుగూడా కొన్ని రచించిరి. వీరి కవితా శైలి సులభశైలి. పండిత పామరజనమున కానందమొసఁగును. పురా తనకవీశ్వరుల పోకడలు వీరి గ్రంథంబున గన్పించుచున్నవి.

ఈ కుబ్జాకృష్ణవిలాసమునందలి ద్వితీయాశ్వాసము నందలి వర్ణనాంశములు, తృతీయాశ్వాసము నందలి కూర్మబంధము, మత్స్యబంధము, ఖడ్గబంధము, మొదలగు బంధవిశేషములును, గర్భితమైన చతుర్విధకందములును, కందగర్భ చంపకమాలావృత్తము మున్నగు వృత్తవిశేషములును వీరి పాండితీవైభవమును జాటుచున్నది.

(కుబ్జావృత్తాంతము)

మధురాపట్టనమును నుగ్రసేనుఁడు పరిపాలించు చుండెను. ఆతని పెద్దకొమారుఁడు కంసుఁడు. అతనికి నూడిగము సేయు దాసి కమల. దీనిభర్త కోమలుఁడు. ఈ దంపతులు సంతానములేక తపోవనంబున నున్న గర్గమహర్షి చెంతకుఁ జని, యాతనివలన తనకొక కుమార్తెగలుగు ననియు, శ్రీకృష్ణుఁడు వరించుననియు, విని సంతసించి తిరిగి గృహంబునకు జనుదెంచి యంతఁ గొన్నిదినంబులకుఁ గమలగర్భవతియై సుముహూర్తమున నొకకూతును గనెను. ఆబాలికామణిపేరు కుబ్జ.

(కుబ్జాపూర్వవృత్తాంతము)

కుబ్జ మువ్వంకలు గల శరీరముకలది, ఈ బాలిక పూర్వజన్మమున, రావణుని చెల్లెలగు శూర్పణఖ. శూర్పణఖ పంచవటియందు శ్రీరామచంద్రుని మోహించి తనను వరింపుమని యనేకవిధంబుల వేడుకొనెను. కాని యప్పుడాతఁ డంగీకరింపలేదు.

శూర్పణఖ పతివ్రతాలలామయగు సీతాదేవిని మ్రింగబోవఁగా లక్ష్మణుఁడు, శూర్పణఖ ముక్కుచెవులు ఖండించెను. అంతశూర్పణఖ విచారపడి, దుఃఖించుచు రావణుని చెంతకుఁ జని, తనవృత్తాంతమును, విన్నవించి, జానకీసౌందర్యముల వర్ణించి. వైదేహియందు, దశముఖుని కనురాగము కల్పించి తాను తపంబున కేగెను.

పుష్కరతీర్థమున శూర్పణఖ పదివేల వత్సరములు, శివునిగూర్చి ఘోరతపం బొనర్చెను. ఈమె తపంబునకు మెచ్చి, శివుఁడు

ప్రత్యక్షమయ్యెను. శూర్పణఖ లోకాభిరాముఁడగు శ్రీరామమూర్తిని నాకు భర్తగా నొసంగుమని వరం బడిగెను.

శివుండా యువతినిజూచి, శూర్పణఖా, ద్వాపరాంతంబున నీ రాముఁడే కృష్ణుఁడుగా నవతరించి నిన్ను చేపట్టగలఁడు. విచారపడకు మని వరంబిచ్చి అంతర్హితుఁడయ్యెను. ఇది కుబ్జాపూర్వవృత్తాంతము.

ఆ కారణముననే శ్రీరాముని యవతారమగు శ్రీకృష్ణుఁడు, మథురాపట్టణమున దేవకీవసుదేవులకు, జన్మించి, యశోదాదేవి ప్రేమ సర్వస్వమై, మనోహరములగు లీలలచే, నా బాలగోపాలము నానందాబ్ధిలోమునుఁగ జేసెను.

ఒకనాఁడు కుబ్జ కంసునికి సుగంధద్రవ్యములు తీసుకొని వెళ్లుచుండెను. అప్పుడే రాజమార్గంబున కంసునిచే నాహూయమానుండై శ్రీకృష్ణుఁడక్రూరసహితుండై గోకులమునుండి విచ్చేయుచుండెను. కుబ్జ తన యపాంగప్రసారమును కృష్ణునిపై బఱపి యాతనిని పరిమళద్రవ్యముల గైకొనుమనెను. అతఁడు గ్రహించెను. శ్రీకృష్ణుఁడు, మువ్వంకలుగల కుబ్జయొడలు, చక్కఁగ నొత్తదలఁచి, తత్పదంబులమీఁద తన పదంబులనునిచి హస్తాంగుళిద్వయమాత్రమా యబల సమున్నమింప నిడి మీఁదికి లేవనెత్తగా కుబ్జ వక్రత్వము వీడి సుందరమూర్తియై నిలిచెను. కుబ్జకు కృష్ణునిపై మోహమది మొదలతిశయించెను. గృహమునకు వచ్చి విరాళిగొని మదనబాధ సహింపజాలక పద్మినియను దూతికను కృష్ణునిచెంతకు బంపించెను. కృష్ణుఁడేతెంచి, కుబ్జమనోరథము తీర్చెను. ఇది యీ గ్రంథమందలి కథ.

## కవితాశైలి.

ఈ కుబ్జాకృష్ణవిలాసము భగవద్భక్తుఁడగు బమ్మెరపోతరాజుచే రచియింపబడిన భాగవతము నందును, గర్గభాగవతమునందును గలదు. పదిపద్యములతో నా గ్రంథములయందు నుడువఁబడిన, యీ కథ, యీ

ప్రబంధమునందు మూఁడాశ్వాసములలో ముచ్చటగా నభివర్ణింపఁబడినది.

కమలాకోమలులు, గర్గమహర్షి చెంతకు జని, తనపూర్వవృత్తాంతము, నడిగి తెలుసుకొను సందర్భమున, కుబ్జాకృష్ణులపూర్వవృత్తాంతమును, మధురములగు కృష్ణలీలలను వర్ణించుటజూడ గ్రంథకర్తృసమయోచితకల్పనా చాతుర్యము వ్యక్తమగుచున్నది.

మఱియు నాయాసందర్భములందు దశావతారములను, సుకుమారపద గుంభనముచే నడుపుటయు, మూలగ్రంథములలో లేని దూతికాకల్పనము గల్పించుటయు, నాలోచింపఁ బై విషయమునే ధృవపఱచుచున్నది.

కవితాశైలి పండితపామరహృదయంగమమై కవియొక్క రచనా నైపుణ్యమును, భావగంభీరతను, బోధించు చున్నది. ప్రాచీనకవితల్లజులత్రోవ ననుసరించి యిందు పురవర్ణనము, స్త్రీవర్ణనము, వనవిహారము, జలక్రీడ, మన్మదోపాలంభనాది వర్ణనములు, సరసులహృదయములను నాకర్షించునటుల రచింపఁబడినవి.

ఇందలి రసము, శృంగారము, అది కుబ్జామనోగత రత్యుపాధికమై గోపీలోలుఁడగు శ్రీకృష్ణుని యాలంబనము గలిగి కుబ్జాకటాక్షాద్యను భావసమ్మిళితమై ఔత్సుక్యాది వ్యభిచారి భావపరిపోషితమై వనవిహారాద్యుద్దీపన విభావసముజ్జృంభితమై సమగ్రముగ నిందు సాధించఁబడినది.

ఇట్టి యత్యుత్తమమగు యచ్చ తెనుఁగు ప్రబంధమును రచించిన గ్రంథకర్తృ కవితా ప్రాశస్త్యము దెలియుటకై, మచ్చునకొకటి రెండుదాహరణము లొసంగెద.

క. చెందొవలఁ దూఱుకన్నులు
కెందమ్ములఁ గ్రేణిసేయఁ గేరెడడుగులున్

చందురు బురణించెడు మో
మందముగల చెలినిజూడ నబ్బురమయ్యేన్.

క. విండ్లాబొమ్మలు తమ్ములు
తూండ్లాకేల్ దోయి మిసిమి తోరంబగు పూ
చెండ్లా గుబ్బలు మెత్తని
దిండ్లాలలి పిరుదులలరు తెలివను దలపన్.

తే. గీ. చెలువలిద్దరు పువ్వుల చెండులాడు
తరినొకటి నొక్కరికొపైట దవిలిజిక్కు
మూడుపాలిండ్లు గలిగిన ముగుదయనుచు
పౌలతులందరు నవ్విరి పొలుపులెసగ.

క. డాలాపిక్కలు క్రొంబన
డాలాకెమ్మోవి తమ్మిడాలాయుడ్లుల్
డాలాచూడ్కులు నునసవ
రాలాజడతీవి బొంగ రాలా చన్నుల్.

ఈ విధము రసవంతముగ, నీప్రబంధమును రచియించిరి. మరియు నిందలి (73) పేజీయందలి, గద్య, ప్రాచీనులగు, నచ్చతెనుఁగు ప్రబంధ కర్తల, ధోరణి నతిశయించు చున్నదా యను విభ్రాంతిని, పాఠకులకుఁ గల్గించుచు, గమ్మెచ్చున దీసినట్లుల సుకుమారములగు నచ్చతెనుఁగు జానుపలుకుఁ బడుగులుబొల్పించుచు, మనోరంజకమై యొప్పారుచున్నది. ఇటులే (100) వ పేజీయందు వచనరచనయు, (109) వ పేజీయందలి దండకము, కుడియెడముగా దీని ననుకరించు చున్నవి.

ఈ కాలమున నచ్చతెనుఁగు ప్రబంధముల రచించువారలే యరిదిగా గన్పట్టెడిని, అందున నీ యాచార్యులవారు మిక్కిలి శ్రమ పడి ఇట్టి యుత్తమగ్రంథమును, నచ్చతెనుఁగున రచించి, యాంధ్రభా

పానధూటీ పాదపద్మముల నొక సువర్ణాభరణము, నొసంగి యమూల్యసేవఁజేసి సందులకాంధ్రమహాజనుల కెల్లరకు శ్లాఘనీయులు. వేల్పుగొండయందు భక్తుల నుద్ధరించుటకై, యవతరించిన లక్ష్మీనృసింహస్వామి, వీరి కాయురారోగ్యైశ్వర్యముల నొసంగి, వీరికి గ్రంథరచనాకౌశలమును, నిత్యాభివృద్ధిగా నొనర్చుగాత.

| | |
|---|---|
| 28-11-32 | ఇట్లు |
| సంస్కృతవిద్యాశాల | బుధజనవిధేయుడు |
| ఓరుగల్లు | విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రి |



# పీఠిక

---

(దాతృ ప్రశంసా)

క. శ్రీకి నికాపురమై వి
ప్రాకలితంబై యనేక ♦ హరిహరభవన
స్తోకంబై సంతతశుచి
కాకరమై యోరుగల్లు ♦ హవణించె భువిన్.

గీ. సరగను ప్రతాపరుద్రభూ ♦ జాని భుజబ
లావనత నొందియుండు మ ♦ హాప్రశస్త
సంపదల కాలవాలమై ♦ సంస్మరింప
దిట్టమైయున్న యోరుఁగ ♦ ల్పట్టణంబు.

గీ. వైశ్యకులమణులు కటకంసు ♦ వంశముక్త
లఖిల సద్గుణవేదు ల ♦ త్యంతసుఖులు
గొంటకులగోత్రు లీశ్వర ♦ కోమలారు
ణాంఘ్రిసంస్మరులయ్యె పెం ♦ పందిరచట.

ఉ. ఆ పరమాన్వయంబున మ ♦ హాంబుధిగన్న సుధాంశుపోలికన్
పాపము తాపదైన్యముల ♦ బాపినకల్పక చంద్రగంగలన్
రూపునుమాపి సజ్జనుల ♦ రూఢివదార్చ్వల సంతసింపుచున్
జూపడె ధర్మమూర్తియయి ♦ జొక్కనుబాలయసెట్టి యొక్కడున్.

ఉ. బాలయసెట్టి ధర్మనయ ♦ భావముల న్వెలుగొందినొక్క క
న్యాలలితాంగి బెండ్లియయి ♦ న్యాయముదప్పక పుత్రరత్నమున్
బాలిమితోడఁ గాంచెలలి ♦ తంబుగ వీరనసెట్టిపేరునన్
గ్రాలిచరించె బేరములఁ ♦ గాదిలినేసి యశంబుజొప్పడన్.

క. రతికినిసమమై శ్రీ భా
రతిపతుల గుణాదికముల ♦ రంజిలి భువి సం
స్మృతిఁగల్గి యల్లమాంబను
హితమతితో బెండ్లియాడె ♦ హితులు బొగడగన్.

సీ. ఆవీరనశ్రేష్ఠి ♦ యాత్మపత్నినిఁ గూడి
పుణ్యావగ క్షేత్ర ♦ ములనుఁ దిరిగి
సత్యవాఙ్నియతులఁ ♦ జాలబేరము లాడి
పిన్నపెద్దలలోన ♦ పేరువడసి
దశరథ నృపువలె ♦ తనయుల నల్వుర
గనియెను పెద్ద వెం ♦ కన్న యనఁగ
చిన్నవెంకన్న నా ♦ చెలఁగి మంగయయన
తుదకు శివ్వయ యనఁ ♦ దుల్లఁదూగి

గీ. రతులవిభవ సుభోగభా ♦ గ్యముల నెల్ల
ననుభవింపుచు మిక్కిలి ♦ యార్యసభల
త్యాగరాగవిరాగ సం ♦ యోగభోగ
ములకు తావలమైరి స ♦ మ్మానముఁ గలుఁగ.

గీ. పెద్ద వెంకయ్యశెట్టి తా ♦ ముద్దియ నొక
రితను పెండ్లాడి గేస్తుబా ♦ డి తొలఁగకను
ధర్మములధనము వ్రయపెట్టి ♦ ధరణివెలసె
సంతతులనిల్పె నేలపై ♦ సంతుశొరకు.

వ. అందు చిన్నవెంకయ్యశెట్టి తెరంగు వినుపించెద.

సీ. ఆయతభోగ భా ♦ గ్యములకు బేరుతో
సాటియే యనుచుండ ♦ సాగెనెవఁడు
అర్థిబేరము లంచు ♦ నన్నిదిక్కుల కెల్ల
దనపేర సాగించి ♦ దనరె నెవఁడు
ఆర్జించు ద్రవ్యమం ♦ దర్ధభాగము దీసి
యర్థిసంతృప్తికై ♦ యునిపె నెవఁడు
తనయిల్లు దామర ♦ దంపమై ధనముల
జుట్టాలఁదమ్ముల ♦ దనిపె నెవఁడు
గీ. వదలకీశ్వర భక్తితో ♦ వరలె నెవఁడు
అట్టి వెంకయ్యసెట్టి గు ♦ ణాఢ్యు డయ్యె
వెలసె యోరఁగలున సిరుల్ ♦ విఱ్ఱవీఁగ
నొక్కకొమరితతోడ దా ♦ నుల్ల సిల్లె.

క. ఆనాగరికుడు మగసం
తానములే కునికి సప్త ♦ ధర్మసుతులపై
పూనికసేయుచు ♦ తమ్ముని
నూనుని వీరననుఁగొనియె ♦ నూనుని గాఁగన్.

సీ. అగ్రజునాజ్ఞచే ♦ నల్లారు ముద్దుగా
కార్యక్రమంబు మం ♦ గయ నడుచుచు
సత్యంబుఁ దప్పక ♦ సాగినబేరముల్
జరుపుచు ధర్మవ ♦ ర్జనములేక
నార్జించు ద్రవ్యంబు ♦ లాఱుభాగములుఁగా
పంచి వెచ్చించుచు ♦ వరమవిధిని
పెద్దలఁబొడగన్న ♦ భృత్యుని కైవడి
వినయవిధేయత ♦ విధిగ నడిపి

గీ. సిద్ధముగుకీర్తి నలుదెస ♦ సీమలందు
వ్యాపకంబునుఁ గావించి ♦ వర్ణనముచి
తాంగనను పెండ్లియాడెర ♦ త్యాంగనాశ
దృశవిలాసిని వెంకమ ♦ స్థిరమతిని.

వ. అట్టి సతీలలామంబు.

ఉ. పేడదుభర్తపై బగితి ♦ విన్న దనంబుగ మాటలాడ మా
టాడదు పెద్దలంగని జో ♦ హారులు సల్పకయున్న వారితో
గూడదు పేదసాదులకు ♦ కోరిక లిచ్చుచునన్న పూర్ణమై
యాడదు వెగ్గుమాటలుప ♦ రార్థనముకై మదితృష్ణలేకతా.

గీ. అట్టిసతియందు మంగయ ♦ సెట్టి సకల
సుగుణగణఖను లిరువురి ♦ సుదతిదుగను
గనియె పరమేశు పాదపం ♦ కజ మరంద
బిందుసందోహపాన మి ♦ళిందు డగుచు.

క. నరసింహసెట్టి మదిసం
బరముం బెంపొంద కటక ♦ వంశజలధికిన్
పరమవిలక్షణకౌస్తుభ
ము రహించెడు వరుస జన్మ ♦ మును జెందెభువిన్.

క. ఆ వెనుక వీరనార్యుఁడు
భావిఫలప్రాప్తి కందె ♦ భవము కళావి
ర్భావముఁగ పెద్దతండ్రికి
తావిరి దత్తకుడునయ్యె ♦ వచ్చెను పిదపన్.

క. ఆయిరువురేక పక్షిగ
పాయకబేరంబులాడి ♦ బహువిధ ధర్మ
స్థాయికులై కనికరమును
దాయలయెడ నైనఁజూపి ♦ దర్పించి తగన్.

సీ. సిరులలరఁగ నర ♦ సింహసెట్టియు వీర
సెట్టియుదారభా ♦ సిత ఘనముల
భూవసతుల నెల్ల ♦ బొందించి వర్తక
శాలల తనపేర ♦ సంస్కరించి
జలదానమున తృప్తి ♦ జరుగు యాతాయాత
జనుల కటంచుపై ♦ త్తనముఁ గదుర
స్థాపించి ధర్మముల్ ♦ జరుపుచు హరికథా
శ్రవణ నైపుణముల ♦ సంస్మరించి

గీ. మరియనేకధనీక శ ♦ ర్మదముఁ గలుగ
ద్రవ్యమార్జన జేసి ♦ విద్యావిశేష
మున గడించి సమగ్ర స ♦ మున్నతాతి
శయయశోభాగ్య భోగ్య వి ♦ స్తారములుఁగ.

మ. వలనున్మిక్కిలి కీర్తినిండ కటకం ♦ వంశాబ్ధిరాకాబ్జులై
వలసద్వీరనృసింహ సెట్టులు మముం ♦ నల్లంతిఘుల్ చక్రవ
ర్తుల తంయూలమహాన్వయోద్భవుల దో ♦ డ్తోబిల్చి తోడ్తెచ్చి రా
గిలు కావ్యంబున గల్గుప్రేమనను ల ♦ క్ష్మీనారసింహార్యులన్.

క. మీ కవితా కన్యకు
బ్జాకృష్ణవిలాస మిచ్చు ♦ పడఁగా ధనమున్
జేకొనుడిచ్చెదఘని మఱి
వాక్రుచ్చి యశో విభూతి ♦ వర్ధిలఁగ భువిన్.

గీ. సంతసించి నేను ♦ సంతత శుభదాయ
కావ్య మచ్చునకును ♦ కావలయు ధ
నమును గొంచుకొని వి ♦ ధంబుగ ముద్రించ
గలిగితిని మనోజ్ఞ ♦ కమున సతము.

---

## దాతృప్రశంసలో

| పుట. | ప. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | ౨ | భవన | భవనా |
| ౩ | ౮ | జుట్టాలనమ్ముల | నమ్ముల జుట్టాల |
| ౫ | ౪ | తన | తేమ |
| ౫ | ౧౬ | ప్రేమనను | ప్రేమగను |
| ౫ | ౨౦ | వాక్రుచ్చి | వాక్రుచ్చి |
| ౫ | ౨౩ | ధంబుగ | ధముగను |

## ప్రథమాశ్వాసములో

| పు. | ప. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౫ | ౨౩ | ౯ | లచ్చికిసరుదు | లచ్చికినిసరుదు |
| ౧౨ | ౪౭ | ౭ | మెలు | మేలు |
| ౧౩ | ౫౩ | ౧౨ | పరియంకము | పరియంకము |
| | | | సతముం | సతము |
| ,, | ౫౭ | ౨౬ | కతక | కతనీ |
| ౧౫ | ౬౬ | ౨౧-౨౨-౨౩ | కాండ్రు | కాండ్రు |
| ౧౬ | ౬౮ | ౧౪ | నేటితెడి | నేటితేడి |
| ,, | ౭౦ | ౨౦ | మన్నిమా | మన్నియ్యుమా |
| ౧౮ | ౭౭ | ౨ | రించగక | రింపగక |

| | | | | |
|---|---|---|---|---|
| ౧౯ | ౮౫ | ౧౩ | కాంచనసౌరు లొప్పు | కాంచనముల నొప్పు |
| ౨౧ | ౮౯ | ౪ | రించగ | రింపగ |
| ౨౨ | ౯౫ | ౮ | కాండ్ర | కాంద్రు |
| ,, | ౯౪ | ౧౬ | విస్రుష్ట | విసృష్ట |
| ,, | | ౨౧ | కాండ్ర | కాండ్రు |
| ౨౩ | ౯౭ | ౧౨ | సంతమి | సతమి |
| ౨౪ | ౧౦౧ | ౫ | నాలు | యాలు |
| ,, | ౧౦౪ | ౧౪ | మెలిక | ఎలుక |
| ,, | | ౧౯ | కోల్పుల్లే | కోల్పులుల్లో |
| ,, | | ౨౫ | బోడు | జోడు |
| ౨౬ | ౧౧౪ | ౨౨ | మాకును మెఱుంగగు నాయనిమొ | మాకునయ మోయని యిగ్గరమొ |
| ౩౦ | ౧౩౨ | ౧౦ | రాయునికి | రాయినికి |
| ౩౧ | ౧౩౬ | ౪ | ఆని | అని |
| ౩౨ | ౧౪౨ | ౭ | మనసీనే | మననసే |
| ౩౪ | ౧౫౫ | ౧౦ | అకూర్రు | అక్రూరు |
| ౩౯ | ౧౭౮ | ౨౩ | గావె | గావే |
| ౪౦ | ౧౮౨ | ౧౫ | ప్రమాకు | ప్రమాను |
| ౫౩ | ౨౪౩ | ౪ | వారీ | వార |
| | ౨౪౪ | ౮ | చిత్రము | బిత్తరము |

## ద్వితీయాశ్వాసములో

| ౯౮-౬ ౦-౬ ౨-౬ ౪ | | | ప్రథమా | ద్వితీయ |
|---|---|---|---|---|
| ౭౨ | ౭౫ | ౧౭ | వేరుల | వేరుల |
| ౭౬ | ౫౪ | ౨ | కొల్పునుడు | కొల్పునుండు |
| ౮౧ | ౧౨౪ | ౧౩ | మున్నల్ | మిన్నల్ |
| ,, | ౧౨౬ | ౨౪ | తెలివాయు | తెలివాయి |
| ,, | ,, | ౨౪ | మెల్లడు | మేల్లడు |
| ౮౨ | ౧౩౧ | ౨౨-౨౩ | నెగ్గ | నెడ్డ |
| ౮౩ | ౧౩౭ | ౨౪ | చెక్కు | చెక్కు |
| ౮౪ | ౧౩౮ | ౯ | గవాళింపు | గరాళింపు |
| ,, | ౧౪౨ | ౨౧ | వాకల | కైకడు |
| | | ౨౧ | వదలని | కదలని |
| ,, | ౧౪౩ | ౨౨ | మంచు | మించు |

## తృతీయాశ్వాసములో

| | | | | |
|---|---|---|---|---|
| ౮౭ | ౯ | ౩ | దొడ్డగా | దొడ్డగా |
| ,, | ,, | ౯ | బల్గి | బల్గ |
| ,, | ౬ | ౬ | చందవ | చెందొవ |
| ,, | ౭ | ౧౨ | మేన | మేలా |
| ,, | ౧౧ | ౨౪ | పమ్యోద | పమ్యోర |
| ,, | ,, | ౨౬ | నేమ | నేమి |

| | | | | |
|---|---|---|---|---|
| ౮౯ | ౧౯ | ౬ | దోఁది | దోఁచి |
| ౯౧ | ౩౪ | ౧౯ | యుట్టిను | యిట్టిను |
| ,, | ౩౫ | ౨౧ | మను | మాను |
| ౯౩ | ౪౧ | ౪ | నిలువ | నిలుప |
| ౯౮ | ౯౨ | ౨౩ | చేయ | చేయి |
| ౧౦౧ | ౧౦౩ | ౩ | పీత | పీడ |
| ,, | ౧౦౪ | ౧౬ | చదుగ | చెదుగ |
| ౧౦౨ | ౧౦౬ | ౫ | జిల్లేడదూఁదిచ | జిల్లేడుదూఁదిచే |
| ,, | ,, | ౧౮ | ద్రోఁచ్చిన | ద్రోఁబ్బిన |
| ,, | ,, | ౨౩ | నత్తం | నంత |
| ౧౦౭ | ౧౨౬ | ౨౧ | పడుకో | పడుకా |
| ౧౦౮ | ౧౨౮ | ౧౮ | తేలురున్ | తేరులున్ |
| ౧౦౯ | ౧౨౮ | ౨౫ | మొల్నాటి | మేల్నాటి |
| ౧౧౦ | ౧౩౧ | ౧౫ | గాక | గాగ |
| ౧౨౦ | ౧౫౫ | ౨౫ | దూలి | దూలిన |
| ౧౨౪ | ౧౭౨ | ౧౭ | నలరా | వలరా |
| ౧౨౭ | ౧౮౭ | ౯ | బాయు | చాయు |
| ౧౨౯ | ౧౯౪ | ౯ | మొల్నాడు | మేల్నాడు |

( శ్రీమతే రామానుజాయనమః )

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః )

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

( ప్రథమాశ్వాసము )

శ్రీలఁదొఱంగి జాలిమెయి ♦ జేజెలుకుయ్యిడ నాలకించి తా
మేలుగఁ గంబమందు పొల ♦ మేఁకరియక్కునఁ జీరఁబుట్టి బై
డాలము మానివేల్పుల బి ♦ డారు లొసంగి జగమ్ముఁగాచి యు
న్వేలుపుఁ గొండతావుఁగొని ♦ వెల్గెడు సింగని నేదలంచెదన్. ౧

చం. కసటుఁదొలంగి పోవఁగను ♦ క్రన్నన నెమ్మది నేదలంతునీ
రసనెడఁబాసి పక్కిదొర ♦ రాతెదయే చిగురాకుబోఁడి మే
ల్పసకడకంటి చూడ్కులకు ♦ వాలెములోఁబడి కూర్మితోడ బా
నిసికులఁబ్రోచు నాకలిమి ♦ నెల్తు కహజ్జగవస్నతంబుగన్. ౨

ఉ. క్రొంచకబత్తిమీర బలుఁ ♦ గొమ్ముల మేటిమెకంబుఁబ్రోవ ర
మ్మంచును నల్లమేనిదొర ♦ కంజలిఁ జేసిన మానవొంది మే
లెంచఁగవచ్చి యమ్మొసలి ♦ యేపణగించి వలన్వెలంగు వేఁ
యంచులకైదువుఁ దలఁతు ♦ హాసుఁజెలంగఁగ బాములాంగన్. ౩

గీ. పొలసుమేతరి వెలఁదులఁ ♦ బొట్టనున్న
గ్రుడ్డుల వియంగ వేల్పుల ♦ యెడ్డలుబ్బి
సొంపుమీరంగ రొదనేసి ♦ సోకుగొంగ
దాకయిని వెల్గువలమురీ ♦ దలఁతు సతము. ౪

ఆ. కావలపుఁడాయె తెంపరి ♦ కావలకును
కనలు కారగ్గి మైయొప్పి ♦ గట్టుఁదాల్పు
కై పిసాళింపఁగల నంత ♦ కమును బత్తి
మీర మదిలోనఁ గోరిక ♦ లూరఁదలఁతు. ౫

ఉ. మేలిమినారి నాదుఱుము ♦ మేఁటరువాణము మెప్పుదానిచే
వ్రాలులఁ గోరి వానయు జ ♦ వంబున జేజెలవాన కోయిలల్
గ్రాలఁగ వేల్పుదాయలవ ♦ గన్మడియింపుచు లచ్చిరేనికై
వాలెమునిల్పు శార్ఙ్గమను ♦ బాజు మొగుల్దలకట్టు నెంచెదన్. ౬

ఆ. బానవాళ్ళనెల్ల ♦ బాములనొందఁగ
నేయుతుంట రక్క ♦ సీఁడుమూక
లడరనీల్గఁ దిరిగి ♦ సోలచ్చి చెలికాని
కేలనలరు గుదియఁ ♦ గేరిదలఁతు. ౭

ఆ. పడుకటిల్లు గొడుగు ♦ పాపాలు పదియూరు
వన్నెపళిడిసాలు ♦ చిన్నిపీట
మొసలు వలువితాల ♦ మదిమది మెలఁగిన
పుడమి శాల్పు నెపుడు ♦ కడుదలంతు. ౮

క. నెమ్మని కఱిదేవరకను
బొమ్మంగల నన్నయానము జగముల బె
త్తమ్మును చేకొని బ్రోచుచు
దిమ్మరు మూఁకపతి మగని తిరముగఁ గొలుతున్. ౯

ఉ. గ్రక్కున వేల్పురేని తొలి ♦ కంటుతనమ్మును చూపులాగునన్
తెక్కులులేని మెట్టులమ ♦ తిన్నెను గ్రద్దల గొండ్లి తీరుగన్
జక్కపడంగ సేయుదగు ♦ సత్తువ రెక్కల గాలివీచు నా
పక్కులసామి యంజలను, బల్మరు వేడెద నిచ్చతీరఁగన్. ౧౦

గీ. పుడమిపుట్టువు సందర ♦ మునను మున్గి
కూలుచున్నట్టి ప్రజలకు ♦ మేలు తెలివి
తెప్పచేలేపి కడముగి ♦ తిని నొసంగు
కారిమారి కొమారుని ♦ కఱఁచఁదలతు. ౧౧

చం. ముసిముసి నవ్వు మమ్మతిలఁ ♦ మోముదువాణము కొదుమబ్బుపెం
పెసగిన కీలుగంటునన ♦ కీడగుమోవి పసిండివిగ్గులర్
బొసగిన మేనునిబ్బరిక ♦ ముగ్గలకగ్గవమేల్ గొనాలకున్
బసయయి పోల్చుకాంతిమతి ♦ పట్టిని నెన్నెద బుద్ధితొమరన్. ౧౨

కం. మూటిఁగల కుమ్మఁదెలిసియు
మూటిని విడనాడి యెడఁద ♦ మురయుచు వేము
మ్మూటి మసహూపుతొమయి
పాటిలు మణవాళరుసిని ♦ వాలెముగొల్తున్. ౧౩

ఉ. ఉల్లములోన నెంతుమది ♦ నొక్కెడసేసియు బత్తిసప్పకే
తొల్లిటి బాములంబొడము ♦ దోసములఁగడజిమ్మ బైజక
ప్పెల్లదలిర్పుసున్నయిడి ♦ యెక్కుడు కోర్కులుఁదీసి ముత్తిరం
పిల్లఁగఁజేసి యగ్గలిక ♦ పిక్కటిలన్గల రంగభట్టుకున్. ౧౪

గీ. బుడుత చెయ్వులగడుకడ ♦ బుచ్చిపగ్గ
నెఱిపి తిలకింపజేసియు ♦ నీటుకైత
లక్కనము నేరిపినయొజ్జ ♦ లమదహూరి
లక్ష్మణార్యుల మదిలోఁద ♦ లంతు నెపుడు. ౧౫

ఉ. తుంటతనంబునంగసటు ♦ తుందుడుకుల్గల క్రొవ్విదంబులన్
కంటువు మజ్జుపుంగలుఁగఁ ♦ గందిరుగాడుచునున్న నన్ను నా
వంటి మొకంబులన్మలిపి ♦ వాలెము మంతనమెల్లఁజెప్పి మే
లంటగసేయు బత్తిగను ♦ లైదగు బెద్దలనెంతు నెమ్మదిన్. ౧౬

కం. చనువున సీరాముని కత
లను వేలుపుఁ బాసలోన ♦ లలిఁగుల్కఁగ జే
సిన పుట్టఁబుట్టు గుఱుసిని
గొనియాడెద గబ్బమునకు ♦ గోలెక్కనగసిపల్. ౧౭

కం. పెఱుమినుకులఁ గలిగిన చి
క్కనుఁ బోకడఁ జేసి నాలు ♦ గు తెఱఁగుల నే
ర్పున నేరుపఱచు వ్యాసుని
జఱుపిగుఱొత్తంగఁ దలఁతు ♦ జక్కని నుడులన్. ౧౮

కం. గుబ్బకొను లక్కనంబుల
జబ్బునపడ నీకమేలు, సతవితములచే
గబ్బములు నుడువగలిగిన
కబ్బపుఁగూర్పరులఁ దలఁతు ♦ కలికి నుడువులన్. ౧౯

ఆ. మంచియొడలి విడచి ♦ మఱిపుంటిచోటున
నీఁగ వ్రాలుతీరు ♦ బాగమైన
యొప్పులెల్ల విడచి ♦ తప్పులచేకొను
కూళగమిని దలఁప ♦ నేల మదిని. ౨౦

వ. ఇట్లు నిచ్చవేలుపుల గొనియాడి కబ్బముఁజేయు పెద్దలంబత్తిజేసి కూళల నీసడించి వెండియు నావంగడంబు దెలియజేయుదు. ౨౧

సీ. హరికితుఁడను జడ ♦ దారి కొలంబున
బుట్టి సింగర గురుడట్టె నెగడి
తోలుఁదోఁనల్లంతి ♦ ఘుఘుచక్రవర్తుల
యను సింటిపేర పె ♦ త్తనముఁ గదుర
మని వేల్పు గొండయం ♦ డను గలమానిసి
సింగనిఁ దాపునఁ ♦ జేరితబము

గావించి పగ్గెలుఁ ♦ గలిగి రచ్చలయందు
విద్దెలచే మెప్పు ♦ వెలసి యెన్న
గీ. నెక్కొరాదారి విచ్చేయు ♦ నేలికయగు
ధంసతేకున కెనుర నె ♦ త్తగవు నిలచి
తెలుఁగు మొదలైన యెనుబా ♦ సలను కబ్బ
మల్లికంయూల బిరుదంబు ♦ నందుకొనియె. ౧౨
గీ. అట్టి కంయూల బిరుదంది ♦ యతివర్యమైన
లచ్చికి సరుదుఁ గలిగిన ♦ లక్ష్మియందు
పాల మున్నీరుగన్న జే ♦ జేలబువ్వ
వలె నృసింహార్యుగనియె జే ♦ ల్వంబుగులుక. ౧౩
ఉ. ఆ నరసింహదేసికుడు ♦ సబ్బపు విద్దెలయందు దిట్టయై
మానిసి సింగనిన్నదిని ♦ మానక రేడుల రచ్చలందు వి
న్నాణెపు దొల్లిపొత్తముల ♦ నమ్మకమున్ వెలయించి పెద్దయై
దానెడ గేస్తు పాడిని స ♦ తంబుగఁ జేకొననెంచి పేర్మితోన్. ౧౪
కం. చివిలక్ష్మినాంచారమ
యను చెలువను పెండ్లియాడి, హాసము గులుకన్
గనునాఁడియాదు నలుగురిఁ
గనియెఁ గొమాళ్ళను కొలంత ♦ కడఁగనువారిన్ ౧౫
కం. సింగరదేసికు డనఁగను
రంగాచార్యుండనంగ, రాణ నృసింహా
ర్యుంగడు రామాచార్యుఁ డ
నంగను దశరథుని బోల్కి, నల్వుర గనియెన్. ౧౬
సీ. తొలుత సింగరదేసి ♦ కులపేరు పెంపొంది
కబ్బములందలి ♦ నిబ్బతికము

తెలుపుచు మఱక్కువ ♦ గలుఁగఁగ నెనిమిది
యక్కరాలను గల ♦ దంతయెల్ల
వజలకుఁ దెలియంగఁ ♦ బలికి మత్తికిఁ బ్రోవ
గానుపింపఁగఁ జేయు ♦ కలికియతఁడు
రెండవ కొమరుండు ♦ ఱండి రాయలతోడి
చెలిమిఁ బెద్దగఁ జేసి ♦ చెప్పి తెలివి

గీ. మల్లుమన్నెంబులెల్లను ♦ మంచిగలుఁగ
పలుకులవలంతితనమున ♦ వచ్చిబోవు
పెద్దలకు మన్ననలజేసి ♦ పేర్మి యలర
బువ్వ తేగంబు గావించి ♦ పొలుపుగాంచె. ౨౪

గీ. నాలుగవ కొడుకు రామరాయ ♦ డోలగమున
వీణె మీటుచు పాటల ♦ వీను లలర
జేసి రాజుల మెప్పించి ♦ బేసి కనుల
చెలిమికానిని మించెన ♦ సిరిని దెచ్చి. ౨౫

సీ. మూడవ కొమరుండు ♦ ముత్తి చేడియదారి
దెలిపెడు పెద్దల ♦ తేజుఁగాంచి
బ్రామినుకులలోన ♦ బబలిన మరుగులు
బయలుబెట్టిన యట్టి ♦ బల్లిదుండు
వేల్పుబాసను నాల్గు ♦ విద్దెలయందును
పేరు కెక్కినవేల ♦ వేల్పు పెద్ద
వలనుగా జదువులు ♦ వలసిన వారికి
నరలేక నేర్పిన ♦ యట్టి ప్రోడ

గీ. రచ్చలను పెంపువడయుచు ♦ రాణ (జెంది)
రొక్కమునుఁగూర్చి దెసలను ♦ బెక్కుయసము

కలయఁ జెలువంబు బెంపొంది ♦ పలువితముల
వేగ్పుతేఁ సుగంబు ♦ల వెలసె మఱియు. ౨౯

సీ. ఎవ్వానియసము మి ♦ న్నేటికి సరిమించి
కలికంతునికి మచ్చఁ ♦ గలుగఁ జేయు
నేవాని యీవిద్రు ♦ బ్బెపారగబికాసి
వానకోయిలతోఁగ ♦ వరలుచుండు
యేవాని విద్దె నె ♦ గ్గేర్పడగా మేటి
బాబులమనినట్టు ♦ బాఫుచుండు
నేవాని సైరణ ♦ లెన్న పల్వితముల
పాలికాపుల మది ♦ బందెమూన్చు

గీ. నట్టి చదురుని నేరుపు ♦ లారడంబు
నీటుకీరితి యొూగుపు ♦ నిబ్బరంబు
లలర తంయూల కొలముక ♦ డలికి చలువ
రాయఁడనఁగ నృసింహాక్య ♦ డాయితపడి. ౩౦

సీ. గోవిందనగరిఁ నా ♦ కొట్టికలోఁ గొప్ప
కోవెలఁగట్టి ని ♦ గ్గులుఁ జెలంగ
సీతను రాముల ♦ చెంత లక్ష్మణ వేల్పు
నిలిపి వారికిముందు ♦ నేర్పుఁ గలుఁగ
కట్టఁగ పదియూరు ♦ కంబాలచవికెను
గట్టించి నెలకు ప ♦ క్కమున కేట
వేడుకలెన్నొఁ గా ♦ వించుచు బెండిలి
తిరుణాళ్ళ సలుపుచు ♦ పెవిలాతి

గీ. వలన నేతెంచు పెద్దల ♦ వాఁవుడుష్మ
సేయుచును బువ్వ నొసఁగుచు ♦ సేమమరసి

తేగముల నెన్నియోఁ జేసి ♦ తిరము గలుగ
నన్నిట వలంతియై తిరి ♦ గెన్నదరుఁగ. ౩౧

కం. దురుసులుఁ బలుకనిదై పె
న్నురుసులు కలనైనఁ గాన ♦ ని కఱకగలదా
నరుసమయను కన్నెను ము
న్నరుసంబున చెట్టబట్టి ♦ యలరె కలిమిగన్. ౩౨

గీ. కడలికూతురు కటివేల్పు ♦ కై మెలంగు
కరణి క్రొత్తడియగు నాపె ♦ కలసి మెలసి
బత్తి సేయుచునుండ న ♦ బ్బుర మెలర్ప
కనియె నిద్దరు కొమరుల ♦ కలికియందు. ౩౩

గీ. కన్నకాన్పున పెద్ద సిం ♦ గరగురుండు
నాఁజెలంగి వలంతియై ♦ నాయముగను
తండ్రి నిలిపిన జెజెకుఁ ♦ దగిన కొలఁది
వక్కమున నెల యేడాది ♦ వఱకుఁ జరుగు
మేలు తిరునాళ్ళఁ జరుపుచు మేటియయ్యె. ౩౪

ఉ. దక్కినపుం విలాతిగల ♦ తామరపాక్కలి తానకంబులన్
మిక్కిలి గాసి రంగమున ♦ మిన్నగ మార్గళిలోని వేడుకల్
చక్కఁగఁ జూచి రాగవుల ♦ చక్కని కోవెలలోని పందిరిన్
రక్కనగోదనోము లట ♦ రం దిరునాళ్ళను జర్పె మక్కువన్. ౩౫

ఉ. వచ్చెడు పెద్దలందఱకు ♦ వంటకముంగుడిపింపఁజేసి తా
హెచ్చిన బత్తితోఁగొలచి ♦ యింపుగ సీతమనాబడంతినిన్
చెచ్చెరగేస్తుబాడికిని ♦ చేకొని సింగనపేర నొక్కనిన్
లచ్చి కొమారునట్లఁగని ♦ లక్కిమినాయని బత్తుఁడైమనెన్. ౩౬

సీ. రెండవకొడుకు మేల్ ♦ రేకలు గలిగియు
రంగార్యుఁడనగను ♦ రాణకెక్కె

తనయన్న యట్టులఁ ♦ దామరపాక్కిలి
బత్తుడై యన్న ని ♦ బ్బరికమునకు
తగినవాడై చాల ♦ దాపరించినకల్మి
పెద్దలకిడుచును ♦ నిద్దమైన
తొలుతటి కోవెల ♦ కలరారఁ దాఁటట
గుడిగట్టి యంకులోఁ ♦ గోదనిగ్చి

గీ. యూరిలో కల్మిగలవారి ♦ కొడబడికను
సిరులఁ జేకొని తిరుణాళ్ళ ♦ కరయువలయు
పలువితంబుల పనిముట్లు ♦ వార్వమనుము
డరదమును గరుడిమొకలుఁగఁ ♦ గలుఁగఁ జేసె ౩౭

సీ. పితరులు తనినన ♦ ప్రేముడిగాగేస్తు
బాడిని మన్నించి ♦ పాంకునివలె
వేడుకరంగమ ♦ వేంకటమ యనెడి
యతివెలు ని ♦ రువు రిల్లాండ్రుగాఁగ
గైకొనఁ పెద్దాపె ♦ కడుపున నైదుగు
రుప్పతిల్లిరి కొడుకు ♦ లొప్పుఁ గలుఁగ
ముద్దులుఁగా విద్దె ♦ లొద్దికఁగా నేర్చి
కడువెల్గిరొగిని వెం ♦ కటనృసింహులు

గీ. డనఁగ సింగరదేసికుం ♦ డన చదుకు జ
గముజగన్నాథుడని బిల్వ ♦ గణుతి సీత
రాముడనగను వెండి శ్రీ ♦ రంగఁడనఁగ
పాండవులవలె మంచిలో ♦ పాటుబడిరి. ౩౮

సీ. పుటి వెంకటమపేరి ♦ మగువచిన్నమయందు
గలిగిరి కొమరులు కలుములలర

దమ్మన్నలకలువలఁ ♦ దలయెత్తఁగాఁ జేయు
దొరలయట్టుల వేడ్క ♦ తుల్లఁదూఁగ
జెలఁగి లక్ష్మన్న ♦ సింహార్య కృష్ణార్యు
లను పేరుతో జంట ♦ నునుపుగలిగి
పైవారు వీరు నె ♦ ప్పగుశైరియాసతి
కొమరులలో పెద్ద ♦ కొమరుఁడనఁగ

గీ. లంతఁదీరఁగ తండ్రి యు ♦ ల్లమున కెలమిఁ
గలుఁగఁదిరుఁగుచు బుడుత చె ♦ య్యూలదోలంగ
నతము పెద్దలదాపున ♦ సంతసంబు
సంపతిల్లఁగ తెలివిలె ♦ స్సయుని తెలిసి. ౩౯

గీ. కైతఁగలిగినప్రాఁతల ♦ క్కనముఁ దెలిసి
కబ్బములుకొన్నిఁ జేసి యా ♦ కారునందు
నచ్చతెనుఁగున నొక కత ♦ విచ్చలవిడి
జెప్పఁగా బుద్ధితామరఁ ♦ జేర్చియుంటి. ౪౦

ఉ. నేనొకనాటి వేకువను ♦ నిద్దురలేచి గురుండలంచి చె
ల్వూనఁగ తానచూడి లలి ♦ యొప్పఁగ వేబది రెండు దోటులన్
దానగగీతము, నామము లో ♦ యారముగానిడి కన్నయన్నొదల్
బూనిక కొరి కేశవుల ♦ బుట్టువులే మణవాళజోగి మేల్. ౪౧

కం. ఏకతమున మంతరముల
జోకనుఁగొని యాడియాడి ♦ జుట్టునకలఁతల్
బోకార్చిబత్తి పెనఁగొన
నాకొమరులు తములు నేను ♦ నాతలిదండ్రుల్. ౪౨

గీ. కలసి గోవిందనగరిలోఁ ♦ గలుఁగుగుడిని
గోదనోచిన పూటల ♦ లోఁ దలంప

మేటిముక్కోటి తిరునాళ్ళ ♦ నాటనుపెరు
మాళ్ళుచవికెకు విచ్చేయు ♦ మాపుతుదను. ౪౩

సీ. కొందరు తిరుముడుల్ ♦ గొడుగులజంటయు
రాణించు వింజామ ♦ రాలువీవ
వీణియుపాటల ♦ వివరించిదాసగుల్
కుత్తికలెత్తి క్రమ్ము ♦ కుక్కుచునుబాడ
వెనుకను ముందర ♦ విరివిగా సొరమెత్తి
బ్రామిన్కులజవముల్ ♦ బావలాడ
వేలకొలంది ది ♦ వ్వెలుబట్టి యిరుదట్టు
సాములుబోగడ విచ్చలవిడిగను

గీ. తళుకువలయురిగుడుసువాల్ ♦ దలలవెలుఁగు
దుద్దుకట్టులచేబూని ♦ తొలుఁగుఁడని బ
రాబరులుసల్పి సాతాని ♦ రాయలుండ
సిరులుఁజెలువార సామివేం ♦ చేసెనంత. ౪౪

గీ ఇంతయని చెప్పరాక న ♦ న్నెలుతండ్రి
కనులపండుగాగన ♦ గంగికల్మి
మీరచవికను రతనాల ♦ మేల్మిపీట
పైసలిపిన తపువాతి ♦ బత్తిఁగలిగి ౪౫

గీ. కేలుఁదుగనొక్క చోఁజేర్చి ♦ కేరిసిల్చి
యున్నతటి నేనుబోవుట ♦ కన్న మొదలు
నున్నపెద్దలు కొందఱు ♦ చిన్నినుదుల
మన్ననలఁజేసి రమ్మన ♦ మరుపుపడక. ౪౬

వ. నట్లు వారి యానకు నంతసము మన్మతిల్ల నేల నంటుఁ ట్లొడలిం జేర్చి కెల్ జంటచాచిపడి లేవకున్న పెద్ద లందఱిలో లక్ష్మణ రుసికిన్మారు రూపుగల మరింగంటి లక్ష్మణదేసికుం డక్కటికము

బూని కేలు దమ్ముల గీలించి లేవనెత్తి తమ దాపున గూరు చుండ సన్న జేసిన వారి యిచ్చ నొడఁగూడునట్లు నడచినంత కొంతవడికి యా రచ్చను గలవారందరాలించి వినుచుండ నమ్మాళ్వారు పాడిం చిన తిరువాయమొళ్ళిలో రాములను బాడిన (కర్పారి రామబిరానై) యను పాశురంబుఁ జదివి దానఁగల మరుఁగు విప్పి చెప్పుచు నడుమ కన్నయ్య కుబ్జకుంజేసిన మెలుతార్కణ గావించినవక్కణంబు నా పెదతండ్రి యగు సింగరాచార్యుం డాలించుచు కబ్బమందుఁగల యిచ్చలలమికొన. ౪౭

ఉ. హెచ్చినకూర్మి నాదరికి ♦ హెచ్చరికన్మిగులంగవచ్చి తా
జెచ్చెరనుండికీరితికిఁ ♦ జెల్వగుపల్కుల కొంతప్రొద్దుబో
బుచ్చికొమాళ్లు బందుగులు ♦ పొందులు తమ్ములు పెద్దలున్వినన్
మచ్చికమీర తియ్యనగు ♦ మాటలవేవిన బల్కెవేడుకన్. ౪౮

ఆ. బావిచెరువుతోట ♦ బాపనికిపడుగు
కైతకోవెలయును ♦ కానులెలమి
బాతిపెట్టుటయును ♦ బొడ్డియై యలరారు
సతవితముఁలఁ గలఁగి ♦ సంతులహహ ౪౯

ఆ. బొడియలరనిల్లు ♦ బ్రాఁతియగా సంతులు
సతమునుండుటకును ♦ చాలకూడు
కబ్బమట్లుఁగాక ♦ కారులెన్నో యుండి
వరలఁజేయు నతని ♦ వంగడంబు ౫౦

క. సరిమునుఁజేసిన కలుచము
తరతరముల పితరులెల్ల ♦ దప్పకపునెముం
దొరకొనెడరంచు పెద్దలు
విరివిగ వాకొసరికైత ♦ వివరించినచోన్ ౫౧

వ. కావుననీవు పొచ్చెంబులేని మచ్చికతో నచ్చతెనుఁగున కుబ్జాకృష్ణ
విలాసంబను పేరట నొక్కకబ్బంబు కొలపుదేవరయగు వేలుపు
గొండలచ్చిమి నరసింగని పేర యంకితముఁ జేయుమని మక్కువ చెక్కు
లొత్తి సక్కటివేల్పు నొడ్డోలగంబున్నతఱి వక్కాణించిన నరియని
కొలువు పెద్దలు బలికిన వల్లెయని యుల్లంబున సంతసంబు వెల్లిఁగొన
నల్లదేవరకు నీ కబ్బంబు నొప్పింపంబూని. ౧౨

(షష్ఠ్యంతములు)

క. సిరిచన్నొట్టులఁగల క
స్తూరికప్రపుటనటి చిన్నె ♦ తులకింపగ ప
య్యోరమే పరిరాయనివిరి
పరియఁకముపైన సతముం ♦ బవళించునకున్. ౧౩

క. నలమేని దొరకుఁగల్గా
మ్మొల మొకముల మీటి గొనవబో ♦ కడచిన వే
ల్పుల రాయమానికమునకు
కలువల చెలిదెగడు మొగముఁ ♦ గల దేవరకున్. ౧౪

క. దిట్టరిక పాలకడలిన్
బుట్టువుమగనికిని లచ్చి ♦ పున్నెంబులకున్
నట్టువఁగలిగిన వానికి
దట్టపుగొలచీకువాలు తామర చెలికిన్. ౧౫

క. మగటిమి కంబముననిలిచి
జగజెట్టన కసకకసిపుఁ ♦ జంపిబుడుతనిన్
దగఁజదలు కాపురుసుతె
న్నగఁబ్రోచిన వేల్పుగొండ ♦ నరసింగనికిన్. ౧౬

క. అప్పనముఁజేసినా నే
ర్పుప్పతిలంగుబ్జయనెడు ♦ యుగ్మలికతన్

టొప్పఁగ నచ్చతెనుఁగున
జెప్పెదసింగారమెల్లఁ ♦ జిప్పిలంగన్. ౫౭

క. మున్ను పరీక్షిత్తను దొర
వెన్నుని లలిగొనము లనెడి ♦ వేల్పుటఁబువ్వన్
బన్నుఁగవీనులఁ గ్రోలుచుఁ
గ్రన్నన శుకుఁడనెడు జోగి ♦ రాయని కనియెన్. ౫౮

క. కన్నయ్య మంచికతలె
న్నెన్నియొ వినియుంటిగాని ♦ యిఁకఁ గుబ్జయనన్
వన్నెఁగల వలఁతిఁ గూడిన
పున్నెపుఁ గతవితముఁ దెల్పు ♦ మోయన యనియెన్ ౫౯

(పురవర్ణన)

గీ. ముగిలిని ద్చెడు వీఁడులు ♦ మూఁడునాలు
గంటుకన్నాకు విభుప్రోలు ♦ చంకములను
మించి సిరికాటపట్టయి ♦ మిన్నువ్రాయు
మాలెలుఁజెలంగి మధురనా ♦ ప్రోలు వెలయు. ౬౦

క. ఆప్రోలు కోటకొమ్మలు
చూపరులకుఁ గానఁబడక ♦ చుక్కలతెఱువున్
రాపిడిసేయుచు పైదా
దాపునఁ జదలేటి తమ్మిదాఁటులను డాసెన్. ౬౧

సీ. బంగారుగోడల ♦ బొంగారుమేడలు
రంగులెసంగి హాళా ♦ రంగుజూప,
రవళింపుగుచ్చులు ♦ రతనంపురచ్చలు
నిచ్చలోమచ్చిక ♦ హెచ్చుఁగూర్చ
మిన్నదన్నెడువెన్ను ♦ వన్నెతిన్నెలచెన్ను
లరుదుగాఁజూపరు ♦ లలరసేయ

పొలుపగుకోటలు ♦ పొందైనతోటలు
మినుపీనునెల్ల తే ♦ చ్చునమూలాడ

గీ. ముత్తియంబులచేరుల ♦ హత్తుచూరు
లలరఁ గస్తురిఁ జల్లిన ♦ యంగణులును
కలువ తామరకెందొఁగల్ ♦ గలుగు చెఱువు
లాటపట్టుగులకిమి కా ♦ వీటియందు. ౬౨

గీ. మచ్చకంటుల మేడల ♦ మచ్చికలర
లలిఁ గఁగూర్చున్న తేటి మక్కు ♦ వలుఁకలిర్ప
నచ్చరలఁ గూడి వీణియ ♦ లంది కోర్కి
తీర వాయించుచుందురఁ ♦ గారవమున. ౬౩

చ. నలనగు వేల్పు రాయకతె ♦ నంబుఁగ తిన్నెలమీఁద రాచక
న్నెలు దెలిముత్తియంబులను ♦ నీటుఁగ ముగ్గులు బెట్టి ముగ్గులన్
గలఁ దమ నీడ జూచి యలు ♦ కందుల కన్నెలటంచు దన్న ము
గ్గులుఁ జెడఁ దెల్ప నవ్వులను ♦ కూఁతులఁ గాంచియు నవ్వుచుందురా. ౬౪

గీ. నెలకలుల దాపుగోడల ♦ నెలవెలుఁగుల
తేఁప తేరులకలులనీ ♦ డానఁ జూచి
రింగుబిళ్ళలటంచును ♦ బొంగి కేలుల
బోరొనర్తురు తెమ్మని ♦ బుడుతలచట. ౬౫

సీ. పాఱులు చెలికాండ్రు ♦ పసలారు మద్దెండ్లు
వాయించుచుండెడి ♦ వన్నెకాండ్రు
గాణకత్తెలగొండ్లు ♦ కమ్మనఁగలపండ్లు
పొల్పగు జవరాండ్రు ♦ బొజుగుకాండ్రు
యలరుల బోదరిండ్లు ♦ కొలఁకుఁ దామరతూండ్లు
మెక్కనంచలపిండ్లు ♦ మేల్మిదిండ్లు

కటికపుపాలిండ్లు ♦ గలిగినవిరిబోండ్లు
సొగసైనవాకిండ్లు ♦ సోర్నగండ్లు

గీ. పోడిమింగలకమ్మని ♦ పూలచెండ్లు
పలుకులలరఁగ కొణిగల ♦ బట్టికాండ్లు
బిడ్డలల్లుండ్రుబంగరు ♦ పెంకుటిండ్లు
కొడుకుకోడండ్లు బబలిన ♦ గునుపుచేండ్లు ౬౬

ఉ. పచ్చలకంబముల్ పసిఁడి ♦ బన్నిన గుంబములొప్పు నంగడుల్
రచ్చలకొత్తడంబులును ♦ రానగరుల్ రతనంపుమాళిగల్
మచ్చులపావటీలుఁ విసు ♦ మానములొ హొరుముంజిముత్తెముల్
గ్రుచ్చినచూరులొప్పుకల♦కుల్ కొలకుల్ వెలుఁగొందువింతగన్. ౬౭

ఆ. తొల్లికుండబాము ♦ దోసిటిలోనేల
బిడ్డమగఁడుకోల ♦ బిచ్చుతత్తిని
యెవరుఁబోవకునికి ♦ నేటిజెడిప్పేడు
జేరెనన నగడ్త ♦ చెన్నుమీరె. ౬౮

ఉ. పచ్చలకుందనంపుఁపని ♦ పన్నిన మేడల నెచ్చెలులుక్కుఱుల్
విచ్చియు చేమ యార్పనట ♦ వేసినసోరన గండ్లవెంబడిన్
వచ్చినకప్రపున్ బొగల ♦ వన్నెలమబ్బు లటంచు నెమ్మికల్
మచ్చికచిందుద్రొక్కుచును♦మాటికిమాటికి విచ్చుపించెముల్. ౬౯

ఉ. వెన్నెలగుత్తికల్లులను ♦ వేల్పులమన్ని మానికంబులె
న్నెన్నియొ దాపికొప్పురము ♦ లెత్తుగ వేల్పుల దారినంటగా
బన్నిన దద్దళంబులను ♦ వాలెముఁజోతులు కప్రిపుఁబొగల్
పన్నుగఁ బర్వవేలుపుల ♦ బావుఁబూజలు సేతురెప్పుడున్. ౭౦

క. వన్నెఁగల వీటనేనుఁగు
గున్నలలరు నెనిమిదివలఁ ♦ కులనేనుఁగులున్

మన్నుదలమ్రోయు ననిమది
నెన్నుచు తలలూపితిరిగి ♦ హెచ్చరికలతోన్. ౨౧

తే. గీ. లగ్గులక్కనముల ♦ లలిరూపులావును
కలిఁగిజింకరౌతు ♦ కత్తళమును
మూలనుండనేయ ♦ జాలినప్రోలిర
వాల్నడల్ జెలంగు ♦ వారువములు. ౨౨

ఆ. వె. పసిఁడికొండబోలి ♦ పగటువేల్పులజేని
బేసికంటిపొందు ♦ బెళుకులాదవు
నరదములనుమించి ♦ యందగించెనుచాల
తేరులరయవీటఁ ♦ దెప్పలుగను. ౨౩

ఉ. ఒక్కటి రెండుపల్లియల ♦ నుబ్బణగించుచు ముజ్జగంబులో
నెక్కుడు కీరితింగనిన ♦ యేనుఁగు రక్కసితోలుఁ దాల్పదిన్
లెక్కలుఁబెట్టకేఁ గడిఁది ♦ లేఁకలునవ్వుచు నీసడించి పే
రుక్కుచలంబు మచ్చరము ♦ లొప్పగనుందురు ప్రోలిలోపలన్. ౨౪

ఉ. పేరిమితో మొగంబొకట ♦ విద్దెలనన్నిటి నేర్చిదిట్టలై
వారకనాల్గుమోముల రు ♦ వాణపు మిన్కులనేర్చియడ్డ పా
టోరగిలెన్ గదాయనుచు ♦ నడ్డమొగంబులవేల్పు మెచ్చక
య్యూరను ద్రిమ్మరిల్లుదురు ♦ నొప్పుగనెప్పుడు నేలవేలుపుల్. ౨౫

ఉ. మువ్వురువేల్పు లొక్కమొగి ♦ బోరన ముంగలనిల్చియుద్దడిన్
జివ్వనుమారొక్కనన్ గడఁగి ♦ నేదలునొందకఁ గెవ్వజాలియున్
గ్రొవ్వఁజెలంగ బాపలకు ♦ కోరినకోరికలిచ్చి వీటిలో
మవ్వఁగసుంద్రుతమ్మిచెలి ♦ మామకొలంబుల రాచబెబ్బులున్. ౨౬

ఉ. లెక్కలుఁగల్గియున్న తన ♦ లిబ్బులఁగన్గొని నిక్కుచున్నయా
జక్కులరేనిబింక మెక ♦ సక్కెముచేయుచు పీఁకుబంతిలో

మక్కువసోములక్కుమియు ♦ మన్ననసైరణ మమ్మరించగన్
దక్కరికోమటుల్మిగులఁ ♦ దామరదంపరలయ్యె నిచ్చలున్. ౨౭

ఉ. కౌనున తెల్లదువ్వలువఁ ♦ గట్టక నెప్పుడు వెఱ్ఱినీళ్లకై
పూనికఁ జేసినాగలిని ♦ పొల్పుగ వెన్నునఁ దాల్చియున్నకే
నేనొక మేటినంచునది ♦ నిక్కుచునుండెడు నొంటిపోఁగురా
నానగుబాటు సేయుదురు ♦ నాలవవారి కొలంబులెచ్చుగన్. ౨౮

సీ. చేదమ్మికొనరుచు ♦ చెలువచేరితియిమ్మ
చేదమ్మియిచ్చిన ♦ చెల్వ దేమి
చనుబంతులిచ్చిన చనెదన్న ♦ చనుబంతు
లెలమిఁగోరుటకంటె ♦ కలువఁగోరు
కలువఁగోరిననీవు ♦ విలువఁ జూపవుగదా
విలువఁదప్పించిన ♦ విరివియేమి
మగువకెమ్మోవిమ్మ ♦ మాటిమాటికినన్న
మోవినిచ్చెదగాని ♦ మొఱలనీవు

ఆ. వె. మొగలదెలియుమన్న ♦ మొగలనుదెలియఁగా
నెంతయానటంచు ♦ వింతలొప్ప
కుమ్మసుద్దులాడు ♦ చిమ్మెయినవ్వీట
పువ్వులమ్ముచుంద్రు ♦ పుష్పబోండ్లు. ౨౯

ఉ చయ్యన మేల్కడాసి పని ♦ సాగిన చందురురాల మేడలో
తొయ్యలులెల్ల చన్నులను ♦ దోగిన కప్పురమున్ జవాదులన్
బమ్మెదఁజాఱతూఱి విరి ♦ బంతుల కమ్మన మోచియెయ్యనన్
నెయ్యముమీఱబట్టమున ♦ నీటుగఁద్రిమ్మరుకూన గాడుపుల్. ౩౦

ఉ. నెమ్మికనివ్వటిల్లఁగను ♦ నిద్దపుబంగరు తూగులాలులన్
బమ్మినతల్గడల్ నునుపు ♦ పాన్పుల సంపెఁగిమల్లి మొల్లలన్

కమ్మఁదనంబుగాఁబరచి ♦ గాణియలెప్పుడు కోడెకాండ్రతో
యమ్ములగుర్తుచేయుదురు ♦ హాసగుపాటల వీనెమీటుచున్. ౮౧

ఆ. వె. వీటిబోటుఁగులెల్ల ♦ వెలయాండ్రవేనలి
కనులచనులఁగాంచి ♦ కాంచివలచి
వారి బొమ్మసన్న ♦ వలయు వానినిఁదెచ్చి
యిచ్చికలయుచుందు ♦ రిచ్చఁగలుగ ౮౨

సీ. పల్యాలుదాలిమ్మ ♦ పాలిండ్లుగజనిమ్మ
మైతావిపూరెమ్మ ♦ మప్పితముగ
చిగురులద్దులనిక్కు ♦ జిలుఁగుగచ్చులముక్కు
తమ్మిమోముసఁజిక్కు ♦ దాపుఁగుక్కు
తొడలసంటునగేరు ♦ నుడులుచిల్కలతీరు
యొడలుకాంచనసౌరు ♦ లొప్పమీర
సారముకోగిలమించు ♦ చూపులేళ్లనువంచు
కురులుచీకటిప్రమాను ♦ గొనబుద్రెంచు

తే. గీ. మోవిమోవికిపాటియై ♦ బోలెకోఁదము
తేంట్లకన్నాపసురపొన్న ♦ తీరుపొక్కి
లలరజవ్వనముంగల ♦ యుతివలవలె
యూటఁదోటలునవ్వీట ♦ యులరుచుండు. ౮౩

(రాజవర్ణన)

క. అప్పట్నం బొడికారం
బొప్పంగను నుగ్రసేను ♦ డొనరఁగ నేలున్
నెప్పరిగతచ్చి కడలన్
జిప్పిరిలిన నోగియసంబు ♦ సిరులుజెలంగన్. ౮౪

ఉ. చన్నులగ్రక్క సంబుపరు ♦ సంబుల కోరుల నొక్కువాతెఱన్
కన్నులజంకువే నలిని ♦ కొడును పెన్నడలందు జాగులన్

బన్నముదాయలన్నుడులు ♦ బాటిలు పొక్కిలిలేమి కౌనునన్
బన్నుఁగ బంచిపెట్టుచును ♦ పట్నముఁ బ్రోచెను రాయఁడెప్పుడున్.

సీ. తనలోతుగొనమున ♦ కునుపాలమున్నిరు
కదలక నొకచోట ♦ నొదిగియుండ
తననేలఁ దాల్చుట ♦ కును దచ్చికడలగా
రులఁ దలలలుకనై ♦ మెలఁగుచుండ
తనయీా విజలకంబు ♦ లును బలపేఱునై
మిన్నేటితోడను ♦ మేలమాడ
తనయసం బుట్టిప ♦ డిన వెండికొండపై
పసగల ముక్కంటి ♦ బలుచబఱుప

గీ. పైడిచూలాలు ఱేడులై ♦ వ్పటికి వెంబ
డించి కొలువఁగ పాడియై ♦ మించిగొనము
లలరుచుండఁగ పజలనె ♦ ల్లపుడు బ్రోచి
వెలయునవ్వీటిలో రాచ ♦ వేల్పుఱేఁడు. ౭౬

క. ఆరాయునిచే ♦ దాయలు
పోవునఁ దెగటాఱి వేల్పు ♦ బోగము చెలులన్
గారవమునఁ ♦ గూడుచునా
ఱారాయని కొసరుచంద్రు ♦ హరుసమెలర్పన్. ౭౭

ఆ. పిఱికితనము కొలము ♦ కొఱ కొఱయీాలేని
గొనము తుఱుగుకల్ల ♦ లునుబిగియును
కఱువు గొడ్డువారు ♦ కలనైన బొంకులు
లేకరాయఁడేలె ♦ జోకమీర. ౭౮

సీ. పగ్గగొనంబులు పరిఢవిల్లఁగ వేల్పు
టొజ్జజన్నపుదిండ్ల ♦ పజ్జఁజేరె

చక్కదనాలకు ♦ చక్కెరవిల్తుండు
మేయిని విడనాడి ♦ మొలఁగనేల
మగటిమి కెడబీతు ♦ మమ్మరించగనోడి
సింగపు కదుపులు ♦ చేరె దోనల
మొగము చెల్వమునకు ♦ తొగలరాయుం డోడి
కోడెరాతునుఁ జేరెఁ ♦ గొల్చుచుండె

గీ. ననఁగనేరుపు సైరణ ♦ లారడంబు
లరుసమును గట్టితన ముక్కు ♦ నక్కటికయు
గలిఁగిమోట ముదెగడుచు ♦ కలఁతవిడచి
పబలె పీటనురహిమీార ♦ పాదుసాహి ౮౯

సీ. పసఁగల మిన్నేటి ♦ పాలసంద్రంబున
మేలుమేలని చాల ♦ నోలలాడి
మల్లెలమొగ్గలమటి ♦ తెలిసుత్తియం
బుల పేరులక్కున ♦ పెలుచదాల్చి
తెలిదీవి వెండి కొం ♦ డలకేగి నుగరాల
నెలరాల దిన్నెల ♦ నీటుఁజూచి
యలరారు పండువెన్నెల ♦ బాజుదెగడుచు
తెలిదామరల ♦ తెగద్రిమ్మరిల్లి

గీ. నలువచెలువ కలువతేని ♦ వలపుతేని
నూడులకు కొప్పునెద నఱ్ఱు ♦ జూపి వెలిఁగి
కీరితనిమొను వెలఁదుక ♦ కేరుచుండి
వచ్చి యీారాచచందురు ♦ పజ్జఁ జేరె. ౯౦

ఉ. మొదలిటిదాసరయ్య తొలి ♦ పుట్టి మెకంబును కొండలేమునె
న్నిమదికడలేనుఁగుల్ చిలువ ♦ మేటి మొదలొక్కని మూాడుబొత్రులా

ముదుకలు జేరి ప్రోచిరని ♦ పొందికగానడిబెట్టి నొక్క చే
నదటుగ నేలదాల్చి కల ♦ యంగసువారలఁ బన్పెఁ దీరఁగన్ ౬౧

గీ. కడలఁగల రాచమూకల ♦ తలలవెలుఁగు
పసిఁడి బొమిడికముల రవ ♦ లెసగు బాజు
లలరి జోహారు సేయఁగ ♦ తొలకుహజ్జ
తామరలుగల్గి దొంనుర ♦ తాణి వెలుఁగు. ౬౨

క. తెఱవాటు కాండ్ర వీరడి
పిటికియు గొండీడు తులువ ♦ పేదయు ముకలా
కఱటివజలే కరాయుం
డఱి ముఱిగాపీడు ప్రోచె ♦ నబ్బుర మొసఁగఁగ. ౬౩

సీ. ఆరావు తనరాణి ♦ తో రాణనుండఁగ
గొడుకులు తొమ్మండు ♦ గుఱు గలిగిరి
అరయఁగ కంసు ♦ డన్య క్రోధుఁడనునాము
కుండుకమాల్యండు కం ♦ కుండుసుభువు
డనరాష్ట్రపాలుఁడు ♦ ననవిస్రుష్టుండన
తుష్టిమంతుండన ♦ తుల్లఁదూగి
కంసయనంగను ♦ కంసవతియనంగ
రాభువుననగను ♦ రాష్ట్రపాలి

గీ. తయనకూఁతులు శలుగురు ♦ గలిగి మిగుల
కలుములలరార నంగడి ♦ కాండ్ర బాదు
గులును బిరుదులు మంతిరి ♦ కొలము గొలుప
వీటబబలెనురా రాచ ♦ వేల్పుతేరు ౬౪

గీ. అపుడమితేరి కెవ్వడో ♦ య్యారమొసఁగ
కప్రముజవాది కస్తురి ♦ గందములను

దెచ్చియిచ్చెడు బోనిస ♦ నుచ్చకంటి
కమలియనఁ బ్రోలఁ జెలువందె ♦ గారవమున. ౯౫

వ. అంత నక్కలికి చొక్కమగు చక్కఁగనంబుల నుక్కుమిగిలి నక్కజంబగు కలిమిచేబుత్తిని సొక్కుచు నొక్కనాడు మంతనంబున హాయిమీఱ తేడుం దానుపడక గదిం విరిసెజ్జంబరుండి తెలివి యుప్పతిలఁ దనడెందంబున సంతులేని కొఱంతగల కలంత బలవంతంబైనఁ దనమగనిం జూచి సొగసులాడి యిట్లనియె. ౯౬

చ. పితరులునెల్లఁ దన్వొసన ♦ బ్రేముడిఁగొందురు నాల్గుదిక్కులన్
సతిమియసంబుఁ బిక్కటిలు చాల్మనవంగడ మందుబుట్టువు
ల్జతనపు గొప్పఁగాంచెదము సంతుఁజెలంగిన నంతసంబుఁగా
నఁ తమినిబిడ్డలం గనిన నాఁకొలమంతట మేలుఁగల్గదే. ౯౭

గీ. బిడ్డలేనట్టివారలు ♦ బెట్టుకూడు
గుడువఁదగదని రుసులెల్ల ♦ నుడివివారి
వారివక్కణమంతయు ♦ వరుసఁదెలసి
మెసవుదురు నీరువంటక ♦ మసలుఁ గలుఁగ. ౯౮

ఉ. తమ్ములులేని కేళకుళి ♦ తావులులేని కడిందిపూలు కెం
దమ్ముల దాయలేని నిసి ♦ తప్పక దిబ్బములేనియిల్లు ద
య్యమ్ములులేని దద్దళము ♦ హాయిగరాయఁడులేని రచ్చవా
యమ్మగునట్లుసంతువహ ♦ హా మొలతెంచనిబాముఁవమ్మగున్. ౯౯

ఆ. సంతులేని వాని ♦ చాలుదలంచిన
బ్రతికినంతవరకుఁ ♦ బబలుసుగము
కల్మియున్ననేమి ♦ కానరెప్పుడు ముత్తి
యిండ్లకెల్ల సామ్ము ♦ లేకొడుకులు. ౧౦౦

వ. కావున మనపుట్టుగుగిట్టుట పట్టిదియె కాని మంచిగానేరదు నా డెందంబునం గల తలంపొడఁ గూడుటకై యడవికేగి బత్తులమై

పొక్కిలిచూలి ముక్కంటి మొదలగు చక్కటివేల్పుల కెక్కుడు
దేవరయగు రక్కసిగొంగ పాజ్జదమ్ముల మక్కువచే తలంచి
మిక్కిలి మ్రొక్కులు మ్రొక్కి కోర్కె లొడఁగూర్చుకొనెదమని
నాలు మగలు తమయిల్లు సూడిగపుచెలియల కంకియఁ జేసి. ౧౦౧

ఆ. పులిసివంగి దువ్వి ♦ బొబ్బమొకంబును
కడఁలియొంటికాడు ♦ కటికమొకము
పుట్టకూడుతిండి ♦ పొడలమొకంబుల
బారుఁదిరుఁగు లొంకఁ ♦ జేరనరగి. ౧౦౨

క. కట్టెదురంగనుఁ గొనెపూఁ
జెట్టులుఁ బొదరిండ్లుఁబలుకు ♦ చిలుకలగమియున్
నట్టువపులుఁగులుఁ దిరివెడు
పట్టగునొక తపసితోటఁ ♦ బడఁతియుఁ దానున్ ౧౦౩

సీ. ఎలికఁపిల్లలఁ బిల్లు ♦ లెలమితో నాడించు
వాలుగలను కొంగ ♦ వరుసగాచు
పాలుపొందఁ గువ్వలఁ ♦ బ్రోచు డేగకొలంబు
సింగంబు లేనుఁగుల్ ♦ చెలిమి సేయు
కాఱెను బోతులు ♦ కత్తళంబులుఁ గూడు
కోల్పుల్లెడులుఁ ♦ గూడి యాడు
చొఁగంటిమొకములుఁ ♦ జడలమొకంబులు
సయ్యాటలాడుచు ♦ సారెఁదిరుఁగు

గీ. చెట్టునట్టులు మేకలు ♦ చెల్మి సేయు
నిటులమొకములు పులుఁగులు ♦ నీడుఁబోడు
గలిఁగియారసబాసియుఁ ♦ గలసిమెలసి
ద్రిమ్మరిల్లును తోటలో ♦ మమ్మరముగ. ౧౦౪

ఆ. ఔరయిచటి పున్నె ♦ మబ్బురం బయ్యెడు
జన్నిగట్టులెపుడు ♦ జన్నములకు
నెయ్యివ్రేల్చుచుండు ♦ నేటగుప్రాబల్కు
సారమువీను లలర ♦ సొంపుసేసె ౧౦౫

సీ. పూవుఁగుత్తుల నొప్పు ♦ దీవెలపై జుమ్ము
జుమ్మని మ్రోగెడు ♦ తుమ్మెదలును
కమ్మనిమావులఁ ♦ గలసలనుఁ దిని
కూకలేయుచునున్న ♦ కోఁగిలములు
చీఁకటిమ్రానులఁ ♦ జేరి మబ్బులటంచు
నట్టాడుచుండెడు ♦ నమిలిగములు
దెసలనెక్కడనైన ♦ మిసమిసలాడెడు
కస్తురిపిల్లుల ♦ కమ్మతావి

ఆ. చదలనంటుచున్న ♦ జన్నంపుక్రొంబొగ
లొరదారి నేగు ♦ వారియుల్ల
మలరఁజేసె నిచట ♦ నవ్వారి ఘనులైన
చక్కబడుసటంచు ♦ చనువుగలిఁగి. ౧౦౬

ఆ. పోయిపోయి యెదుట ♦ బులితోలుఁబఱచిన
గద్దెపై నిరుసుల ♦ గమిఁగొలువఁగ
గూరుచుండి తెలివి ♦ గుర్తులుఁ దెలుపుచు
హారుసమొడ్డలోన ♦ నగ్గలింప. ౧౦౭

చ. బసుసుము మేనఁబూసి చెలు ♦ వంబగు దామెరపూసలక్కనన్
మిసిమి జెలంగవేసి యఱ ♦ మించుజడల్ జిగికావిపట్టముల్
మసలఁగ కక్కపాలయును ♦ మచ్చికమీరఁగ దాల్చియున్న పె
న్నసియగు గర్గునొక్కరుని ♦ నోములుబండగ జూచిరిమ్ముగన్.

చ. కనుఁగొని యంజదమ్ములకు ♦ గాదిలి మ్రొక్కులు మ్రొక్కుచుండె బ
ల్తెని పొనకాడ నెన్నుదురఁ ♦ దిన్నగ చేతుల జంట మోడ్చి మె
ల్లన రుసివేల్పు రాయనికి ♦ లక్కన మొప్పెడు సుద్ది వాకొనెక
దనఁదగు పోలుపొందువిని ♦ తమ్ములఁ గలిర్పఁగ నేయునట్లుగన్. ౧౦౯

ఉ. ఓజడదారి రాయనిను ♦ మూరటలేకయు కక్కసంపు రా
లోజ చెలంగుదాకలకు ♦ నోడక నాజవరాలిఁ గూడి రా
దేజుగ తొల్లి పున్నెమును ♦ దొంచుటచేఁ గడగండ్లఁ బాసి మే
మీజతనంపుఁ దోఁటహరు ♦ వింపెసఁగన్ గననయ్యెని య్యెడన్.

ఉ. వచ్చినతోడనే నిటకు ♦ వచ్చితినాడు తలంపునీకు వా
క్రుచ్చితి నన్న నత్తపసి ♦ కోమలు నింగని పల్కె నెమ్మితో
నెచ్చటికేగెదో యిచటి ♦ కేలకు దెంచితి వేది ప్రోలు నీ
కిచ్చటఁగోరు గోర్కులున ♦ వేవియొ దెల్పుము పేర్మితోననన్. ౧౧౧

గీ. మధురనా ప్రోలి లోపల ♦ మనికినాది
వేడుకను తేనికెప్పుడు ♦ వీఁక మీఱ
పునుఁగు జవ్వాది గందముఁ ♦ బూయనిచ్చి
వచ్చెడు వలంతికమలినా ♦ పలపు రాణి. ౧౧౨

వ. నా పేరు కోమలుండ మే మిరుపురము. ౧౧౩

ఉ. దొడ్డతనంబు కల్మిఁగని ♦ తొల్లిటి కావల ముప్పతిల్లఁగన్
బిడ్డలు లేక బెంగగొని ♦ బెగ్గిలికంబును చిప్పిరిల్లఁగా
నుడ్డమొగంబు వేల్పునెన ♦ నొప్పకము త్తికిఁ బ్రోవలేని కా
అొడ్డెము వ్రాసె మాకును మ ♦ ఱుంగునాయని యొక్క వేకువన్.

క. కలువరపడి రోసియు నా
యిలు చెలువలకంకెఁ జేసి ♦ యిటు రాఁగనుమా
తొలి మేననేయు పున్నెం
బులుఁగలుఁగుటవలన మిమ్మ ♦ బొడగంటి మొగిన్. ౧౧౪

క. కారానిపనులు మీచే
గారాబమ్మునను దీర్పఁ ♦ గానగునంచున్
గోరిక నుడివితిమినిరా
బారికఅదతమ్మివిప్పు ♦ పట్టిదొరయునన్. ౧౧౬

గీ. ఆలకించుచు జోగితా ♦ నబ్బురమున
కోమలులమలుబల్కు సుద్దుల ♦ కుమ్మఁదెలిసి
జరుఁగబోయెడుఁ జరిగిన ♦ జరుగుచున్న
వైనములఁజూచి మాలిమిఁ ♦ బూనిపలికె. ౧౧౭

మ. వినువీడుంగలమేల్ సుగంబులను ♦ వేవేపొంకగా సంతువున్
గనినఁగాని పునెంబుఁగల్గదని యీఁ ♦ గ్రాల్గంటితోవచ్చి మె
త్తనినెమ్మితోఁదబమ్ముందుఁ గాసిలఁగనెం ♦ తంజేసి ముప్పొకలా
డొనరింపంగల మేలునొందెదసుమా ♦ హోతల్చి తేఁ జూడఁగన్.

ఉ. నీవుదలంచి వచ్చినప ♦ నిన్నెరవేర్పగలంత ముబ్బునై
దేవరయిల్లుఁ జేరుమనఁ ♦ దెల్లనికై మతిబల్కె యోఁగసీ
తావరమంతు నుండిపలు ♦ దాయలనోములు నోచియుండఁగా
యోవగనైన సంతుగలి ♦ గించుటలేమిఁ గీము వెల్లితిన్. ౧౧౯

వ. వెండియు జగమ్మునన నల్వాయు. ౧౨౦

ఉ. సంతువటంచు మొఱ్ఱలిడి ♦ సారెకుమ్రొక్కఁగరాని వేల్పుమేల్
చెంతకుఁజేరి సేతగని ♦ సేతలుసేసినఁగాని వారికిన్
పంతముఁ గట్టినట్లు మరి ♦ పంబునుఁజూపిమ సంతుగూర్పకే
వంతల పాలుఁజేసియది ♦ వద్దనువారికి నిచ్చుపెక్కుగన్. ౧౨౧

సీ. సిరిగలవారినిఁ ♦ జేయు తెగుల్లల్ల
పేదలకాకలి ♦ బెట్టుపెక్కు
సమకూర్చుముదు కని ♦ జవ్వసికిని జాణ
తకుఁగూర్చు తులువను ♦ తగుగోనములు

గలమేటికిచ్చు ని ♦ చ్చలు నఱ్ఱబ్రతుకును
బ్రల్లదునకు నిచ్చు ♦ బ్రదుకునిడుద
తేగముల్ గలవారి ♦ తెగకు లేమి యొసంగు
నీలేనివారల ♦ కిచ్చుకలిమి

గీ. గానఁదగనట్టి చెయ్యుల ♦ బూనిసేయు
నలు మొగంబుల వేల్పు కే ♦ కలవరంబొ
ముప్పుదప్పిన కుదుసలి ♦ యెప్పుడైన
సేయఁదగినట్టి పనులను ♦ సేయఁగలఁడె. ౧౨౨

వ. అయినను తొల్లింటిబాముసఁ జేసికున్న కసటునన్నాకు కొడుకులు లేనిది కొఱంతగలదయ్యె ముఁగిలిసుగంబు దప్పించినది గావున మీరారు వివరించు వివరంబు తేటతెల్లమిఁజేసి బిడ్డలుఁగలుఁగు తెఱంగు లెట్టులనో యేర్పరించుటకు మీ యట్టి పెద్దలవలనం గదా కొంకులు విడుచుట కునుటయు రుసిచందురుఁడు. ౧౨౩

ఉ. జవ్వనిమిన్న కోమలుత ♦ సారెకు సారెకు మీతలంపులో
నెవ్వఁగ నొందనేల తొలి ♦ నిండిన దోసము మూడువంకలుఁ
నివ్వటిలంగ కన్నెకయు ♦ నెప్పరియొక్కతె బుట్టుదానిచే
మవ్వపుముత్తిగల్గు విను ♦ మానపువంకలడంగు బిమ్మటన్. ౧౨౪

గీ. వెలయముప్పొక లెఱిగిన ♦ వేల్పుతేని
చెలిమిఁగావించు మగలాగు ♦ సేతతోన
తనివిసనఁ గొల్చికొడుకు నొ ♦ క్కనిని గనును
గానయిలుఁగూర్చి పొమ్ము నీ ♦ క్కసగు తలఁపు. ౧౨౫

క. నావినిరుసి మీసరకున
కావెలఁదుక బలికెముగితి ♦ నందించెడిదొ
వావిరి ముఁవ్వంకలు దిగి
బోవుటెటుల చక్కఁజేయు ♦ ప్రోడయెవండో ౧౨౬

సీ. అదిగాక కలుసాన ♦ నొదవిన దానిని
ముప్పోకలాడేల ♦ ముట్టుకొనును
ముట్టుకున్నను లాఁతి ♦ ముద్దుగుమ్మలఁ జాల
నెవగు నించుటకేల ♦ నెగడుచుండు
నెగడెపోయతఁడేల ♦ నేనున్నతావున
కరుదెంచు నయ్యత ♦ గ్గసకబొమ్మ
గ్రుడ్డులోపలి పజ ♦ కూరిమిఁగాచగ
దలచియుండెను గాదె ♦ తల్లిదండ్రి
గీ. నాను బత్తులఁబ్రోవఁగ ♦ దలఁచిపుడమి
కరుగుదెంచునో లేకయీ ♦ యున్నమిన్న
నొక్కరితఁ బ్రోవ నేతెంచు ♦ నోకలంకు
వీడిపోదె ప్రహాసంబు ♦ విఱ్ఱవీఁగ. ౧౨౮
మ. అదిగాకింతకు వెన్కబాముననయహో ♦ యూఁకూఁచే కొన్నమై
కొమకుల్ నాకుపటారిసుద్దులను వా ♦ క్రువ్వంగమీ కుందగున్
ముదితన్ మేమెటుగాంచ గల్గుదుము బెం ♦ పున్మిర నీముద్దబె
ల్లిఁకపూ దోసములీఁగుఁబెట్లగునో తా ♦ ల్మిన్ దెప్పి మన్నింపవే.
క. సిరిపెనిమిటికే తలలో
దురుసగు నేతలనుఁ జేసి ♦ త్రుళ్లెకొనాకున్
దరవడిగఁ దెలియబలుకుము
పరిపరిడెందంబు చెదరె ♦ బమ్మెరఁగలిఁగెన్. ౧౨౯
వ. అనినవిని రుసిమానికంబు నెట్టన రెట్టించిన సంతసంబుట్టిపడ నా
దిట్టరులఁజూచి మీరు తలంకకుడు మీతలంపొడఁగూడు దానిని
తేటతెల్లమిఁ జేసెదనని యిట్లనియె. ౧౩౦
గీ. మునుపు బహుళాశ్వుడను రాచ ♦ పులికివేల్పు
తపసిరాయుఁడుఁ దెలిపిన ♦ దానిమీఁకు

తేట తెల్లమి జేయుదు ♦ తిరిగి తొల్లి
బాముసను సేయుదురుసుల ♦ వడఁతికతను ౧౩౧

సీ. మునుపుసీత మగండు ♦ మొనసిత డిరి యుంన
కలికితో తమునితో ♦ కానకేగి
పంచవటిని నాకు ♦ పాకసుగట్టించి
సుగముగా నుండగ ♦ శూర్పనఖయ
నెడు చెలియే తెంచి ♦ నేలనాయుప చక్క
దనమున జూచి త ♦ త్తరపుగదుర
వలరాయునకి మాఁడ ♦ వలరాయుఁడగు వీని
పొందులేని పలంతి ♦ ఘాటుగుపాటుకై

గీ. యనును మదినెంచి సంతోస ♦ ముగ్గడఁప
తాను వలపుమిటారియై ♦ దగ్గరించి
కలికిచూపుల జూచుచు ♦ కలిమిడిగను
బలికెమొత్తని మాటల ♦ బుస్మరించి ౧౩౨

ఉ. రాచకొమార నాకువల ♦ రాయని కన్నను మిన్న వాటచే
దోచెను పెండ్లియాడికల ♦ తోయము తీసు మెలంగవచ్చితేన్
బ్రోచెదవో మతెం వెఁడల ♦ దోసెదవో విపరింపుమన్న నా
రాచకొమారుఁ డొద్దికను ♦ రావణు చెల్లెలితోడ నిట్లనున్ ౧౩౩

గీ. మెలఁత నాతోడబుట్టువు ♦ మెలఁతలేక
యున్నవాడదె వానితో ♦ నున్న నీకు
జేజెపట్టునఁ గలమంచి ♦ జెందవచ్చు
ననిసరక్కసి విని లక్ష్మ ♦ ణుని కదిసియు. ౧౩౪

ఉ. ఓమగనీదు చక్కదన ♦ మువ్విళులూరఁగ సేయవచ్చితిన్
నామదికోర్కె దీర్పుమని ♦ నాతుకబల్కిన నవ్విలక్ష్మణుం

జోముడఁతీన నుంగొనిన ♦ సూడిగ మెప్పుకు సేయువాడనా
తోమటికన్న నగాడిగవు ♦ తొత్తునటంచని బల్కరేపజల్. ౧౩౫

క. ఆనివిని యుద్దరి చెంగటి
కిని యిటునటు తిర్గితిర్గి ♦ కేగుచునుండన్
గని యొక్కటాలు బత్తమును
గొనుచశరధుకొడుకు వలపుఁ ♦ గొనకయెనుండక్ ౧౩౬

ఉ. చక్కదనాల కుప్పయగు ♦ చానను బ్రిమింగిన నన్నుగొందు రం
చొక్కమొయుం దలంచియుండి ♦ యుమ్మ్యేలదై జెలువొందబ్రిమింగ బో
నక్కటయంచు ముక్కు చెవు ♦ లంటగ గోయుమటంచు నన్నబీ
తెక్కఁగ జేయునట్టులొన ♦ రించెను తమ్ముఁడు కాఁకు దొల్లగన్.

గీ. ఇలుముకు చెవులుదరిగిన ♦ యింతియేగి
యన్నయగు రావణునితోటి ♦ యున్నదున్న
యట్లు వివరించి సీతహూ ♦ యులను దెల్పి
తెచ్చుకొననట్లుజేసి య ♦ త్తెఱవఁ గౌగిలి ౧౩౮

గీ. అంతటనుబోక కాఁక్రేని ♦ కంకియపడి
పుష్కరంబను తీర్థము ♦ బోయియచట
మగపజయు సల్పుతబము నె ♦ మ్మదిగ సేయ
బూనివిరికందువను చాల ♦ పూనిక్కఁ జేసి. ౧౩౯

గీ. సరవిపదివేల యేడులే ♦ సరసులేక
మిత్తిగొంగను మదిలోన ♦ హత్తుకొనుచు
సేయగా వెండికొండను ♦ సీమగలుఁగు
గిబ్బతత్తడి రాతుతా ♦ కేరినిలిచె. ౧౪౦

ఆ. నిలచిదుగ్గి మగడు ♦ నెలఁతయేమిటి కోరు
కొనెదవేమొ తెలియఁ ♦ గనుపరుచుము

టంచు బలుకలేను ♦ తవరఁగా నిట్టను
వేఁడ్పు వేల్పుకొండ ♦ విడిచి జేజె. ౧౮౧

క. నాకోరిక వినుపించెద
చౌకనొనర్పంగవలదు ♦ చక్కని వాఁడా
రాకొమరుఁడు రామునికై
జేకొనుమదికోర్కి బొడమె ♦ చేయుము నన్నిఁకెన్ ౧౮౨

క. ఒకటూలు బతేమబట్టిన
పకపకనగు మొగపురాచ ♦ పట్టిని చే ప
ట్టకటూసాగునె యూర్కొ
మ్మకరుంగు నె వానిమొదద ♦ ముంగరుకోర్కుల్. ౧౮౩

గీ. ద్వాపరములోన తుదకును ♦ తాతతండ్రి
చెలఁగి దేవకికిని బుట్టి ♦ చెనఁటి పజను
ద్రుంపగావచ్చి నిన్ను చే ♦ నింపుగలుఁగు
కలవమును గొనియేలును ♦ గారవమున. ౧౮౪

గీ. అనుచు కోరినకోర్కిని ♦ యగ్గికంటి
యొసఁగియేగిన పిమ్మట ♦ నొక్కపొద్దు
తోడనున్నంత వరకును ♦ తొలగనిమొద
రాగవునిపైన మెలఁగఁగ ♦ రానయుండి. ౧౮౫

వ. బాముబామునకు పూవిల్తునకు పూవిల్తుఁడగు రాగవుండు దప్ప మఱియొకరి నాకఅదకు తేఁడుఁ గాడని తలంచుచు నుసురులను వదిలె అది వెండియు ద్వాపరము తుదకు మథురయనెడు పట్నం బున కంసునికి బానిసెతనంబు నేయు కమలకోమలులకు జగము తల్లియగు చాలుపేరిటి సన్నవలఁతిని చెరబట్టించిన దోసంబీ బామునగల వేసంబునకు మువ్వంకలు గలిగించి కుబ్జ నాపేరట జెలువారుచుండునని. ౧౮౬



శ్రీమతే రామానుజాయ నమః

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః )

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చతెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

( తృతీయాశ్వాసము )

క. సిరిచాన మేనుతీవను
విరియు చనులపూలగుత్తి ♦ విడిమట్టగు తే
టిరహిన్వేలువు గొండను
మరిగిన రక్కసులగొంగ ♦ మానిసి సింగా. ౧

వ. అలకింపుము. ౨

క. అనితపసి కట్టిమనుమం
డునుఁ బల్కినపల్కులకు పొ ♦ టుక్కున బుద్ధిం
బొనుకాడెడు హారుసంబున
వినిచినఁగు చెక్కులొత్త ♦ వినుపించె తగన్. ౩

తే. గీ. అటులఁబద్మిని నాచెలి ♦ యులరువిల్తు
డున్నపట్నముఁ జేరంగ ♦ తెన్నునడచె
నంతగాములతేడు తా ♦ వింతవెనుక
దెసనుఁగల కొండపై బ్రాలె ♦ తిరముగలిఁగి. ౪

ఉ. ఆ మసఁబోయినాక చెలి ♦ యూరెము నన్వలవంతమీరి పెన్
బాములనొందుచుండఁగ సె ♦ బాసని క్రొన్ననవిల్తు దొడ్డగా
నామనిచందమామ సుర ♦ లచ్చటఁగొల్వఁగ గొల్వునుండిగా
రామున బల్గిమందరకు ♦ గ్రమ్మన నేమనఁజేసె చెయ్వులన్. ౫

ఉ. చేసినతోడనే వెడలె ♦ చెందవవిందును గాలిఁబూదటిన్
వేససిఁగుల్కనుంచి విరి ♦ విల్లునుగేలను దాల్చి వేటకౌ
వేసముఁబూని మ్రాకులను ♦ వింతగుమాటును బొంచిపొంచి సం
తోసమెలర్ప గన్గొనెను త్రో ♦ వను బెగ్గిలులేడికంటిఁదాన్. ౬

క. కనుగొని గోర్వంకల వే
గున కన్విరియొయార మొప్పఁ ♦ గోగిలగమిజొ
ట్టును ముట్టనిలిపి నేనా
మనిచాల్పగనునిచి వేఁడ్క ♦ మదిఁజిల్కతోగన్. ౭

క. ఉసికొలిపి పికపవనవి
ల్లైనఁగఁగ పూవాలుఁగూర్చి ♦ యూరెముకూఁటుం
ససిఁగఁగొని చనులనడుమను
కసిదీరఁగ మలయనేసె ♦ కాతాళముగన్. ౮

వ. ఇట్లేసిన కనలి యురువడించిన నబ్బలగంబును. ౯

చ. కనితలపోసి కొంతవడి ♦ కన్నులరెండిటనుండి వచ్చునీ
ర్చనుగవ కొప్రమందు బడి ♦ జారఁగకుందుచు గువ్వగుత్తికన్
వినుఁడు వెలందులార నన ♦ విల్తుఁడునున్నితూపులేసె క్ర
న్ననపులుకాఁసి పుల్గులుక ♦ నారిలిబల్కులు బల్కె వెండియున్.

ఉ. మ్రోసెను తేటిమొత్తములు ♦ ముజ్జగమందున తేజువెన్నెలం
గాసెను చందురుండు చలి ♦ కమ్మనిపయ్యెద తావిముల్కులన్
వేసెను గండుకోయిలలు ♦ విన్దెసలెల్లను నిండునట్లుగా
కూసెని కేగ తిన్మరుల ♦ కున్మదినోరుతు నేమనేయుదున్. ౧౧

క. అనితనను దెప్పరములం
దనునేసెడు తేఁటిరాము ♦ తమ్మనుగోర్వం
కనుతలిరు మెపరినినిం
పున సమతంబెట్టఁ దలచి ♦ పొలఁతుక యనియెన్. ౧౨

ఉ. తేఁటిపలంతులార ఘువ్వు దేనియ ♦ లంగడుఁ ద్రావి త్రావి మా
తోఁటిపసందు మీరఁబలుత్రోవలఁ ♦ బోవకనొక్క తీరు మో
మాటము లెంచియుండు డది ♦ మంచిది యిప్పుడు లేక పోయినన్
జాటిన మమ్మదిర్చినను సంపెఁగి ♦ గందులమంచు మెప్పుగన్. ౧౩

చ. పరితములార మీకసుల ♦ బల్కినుకల్ గిలగొట్టుచుండనన్
సరమలఁ బెట్టనేల నరు ♦ సంబున మామిడిమోకగుడ్చి చె
చ్చెర నొకకుత్తుకన్ గలసి ♦ చెల్మినిసేయక వాదులాడగన్
సరిపడ దెట్టివారికిని ♦ చక్కగదిద్గుడు తేమలెన్నఁగన్. ౧౪

చ. చదువుల పక్కులార మసఁజ ♦ క్కెర తేసియఁ బాలఁ గ్రోలి బె
ట్టిద మొసలార మీమెఱవ ♦ డిన్వోసఁజూపుచు నుండనేల నే
నెద బెదురింతయైన గొన ♦ నేగుడు నివ్వెఱనొందనాదులన్
చదురులమంచు నిక్కెదరు ♦ చాలఁగ నేర్పడె మీదు నేర్పులున్.

గీ. కొమ్మగమి నెక్కి దిరిఁగాడి ♦ కొమ్మగముల
సరములనుఁ బెట్టనాయమూ ♦ సరవి నెళవు
జెఱుచువార లటంచు నా ♦ నెఱికిఁ దెలిసె
నరయుజవ్వాది గందిన ♦ టంచుగనుడి. ౧౬

క. అనియెగ్గాడెడు తోయము
ననుగందపు కనుమయుందు ♦ ననుదిరుపుచు చ
ల్లన కమ్మనగొని పయ్యెర
తనమేనట గ్రందుకొనగఁ ♦ దరుముచుఁ బలికెన్. ౧౭

క. మునువేల్పు టొడయఁడును నే
ర్పున నింతటివాఁడవనుచు ♦ బోసికనునిన్
దునుకలు మూఁటిని నాల్గిం
టినిఁ జేయుటవలనఁ జగము ♦ శివిగొనుంజెన్. ౧౮

తే. గీ. క్రమము జవాదికడిని బు ♦ క్కాఁమువోది
ముంపుచో నిన్ను నేమన్న ♦ బుద్ధిని ...
సంబు గొనవికగాలిపి ♦ సొసియున్న
కై పుసామితనికమిక ♦ గాలిగీలి. ౧౯

తే. గీ. ఔర మును బొమ్మ నీదు పొం ♦ గారఁజూచి
యొకరికొక్కరుఁ గలువక ♦ నుంకునటుల
మూలకొను వేసెఁగావున ♦ ముజ్జగంబు
లలరె లేకున్న ముంచెద ♦ రక్కటకట. ౨౦

తే. గీ. అంటగిట్టని వేల్పుతో ♦ నరయనేస్త
మాటవల్లను నిక్కువ ♦ మతనిగొనము
ప్రైరసీకబ్బె నొబలా ♦ వలిపిరికిని
నట్టువనుమాటఁ బోనాడ ♦ నాయమేర. ౨౧

ఉ. చట్టనవీనుల న్వీనుము ♦ సారెకు సారెకు కన్నెనందులో
దిట్టరిచన్నెముం బునెము ♦ తీరు లెరుంగను నేనుఁగట్టినన్
వట్టిదిగాదు నానుడువు ♦ వాలఁగునంచు నటమ్మ నమ్మ నీ
బెట్టిదమేల కాఁతులను ♦ బ్రేలెద చయ్యనకమ్మ కర్వలీ. ౨౨

మత్తకోకిలావృత్తము

రాకురాకు మటంచు నిన్నప ♦ రాకుఁ జేయుచు వేడినన్
వీఁకగందపుతావి బూనియు ♦ వీచగానిది బాగె మ
నోక్కుకుఁ గోరనుఁదీయఁబోపని ♦ గొడ్డలింగొన నెందుకో
సోకుదయ్య మటంచుబల్కెడు ♦ జోలినిక్కువ మయ్యెరా. ౨౩

క. విను నిలుకడ గోరంతై
ననులేకయె దిర్వ్వలాడ ♦ నాయంబౌరా
పెనుసుళ్లు మునుఁగుదువు నర
యను కనుపడనట్టిబూత ♦ మై పోదువురా. ౨౪

తే. గీ. ఎంత వేడినఁ గాని నీ ♦ కింతయైన
కనికరముఁ గల్గదాయె ని ♦ క్కముగ నీదు
క్రొవ్వునఁగింతుఁ దెలియునే ♦ కొండవంటి
కటికపుంజనుగవగల్గు ♦ కన్నె కనుర. ౨౫

ఉ. గోరము లందజాలనిది ♦ గోకను క్రుక్కితి నూరకుండుమా
పైర బళీయదల్చకుము ♦ బాములు బాములబెట్టి నిన్నుక
డ్వారమొసంగుగాక చెలు ♦ వారెడు నీవడియొడ్డు కారుపా
లౌరసరాసరి న్నెరయు ♦ నారడిఁబెట్టక మిన్నకుండురా. ౨౬

క. అని ఝుటుల నాలిగాలిం
గినుకారఁగ దూఱి పైఁడి ♦ కీల్బొమ్మమసఁగ
గాని మరలఁదిరిగి బుద్ధిని
కనికరమారంగ పొగడ ♦ గాఁ జొచ్చె వెసఁగ. ౨౭

తే. గీ. పాపగమి తేని గెలిచియు ♦ పసిడికొండ
కొవ్వరము నీరువామిని ♦ కూలదీయు
నట్టిమగటిమిఁ గలుఁగఁగ ♦ నలరిజగము
నిండుపయ్యెరతమి బెట్ట ♦ కుండు నన్ను. ౨౮

వ. అంత నమ్మగువ వగ నెగడ నెగులున నిగపునట్టువను బొగడుచున్న
తోయంబున. ౨౯

క. చల్లని తెల్లని వెలుఁగుల
నుల్లసమాడగను కలువ ♦ నొడయుఁడు చదలన్

బల్లిదుడై తిరుగుచు వెద
జల్లెడు కాఁకలకు నదలి ♦ సయ్యనబలికెన్. ౩౦

తే. గీ. మున్ను తనయొంకిఁ గూలఁగ ♦ నిన్ను బుట్ట
జేసెఁ జేసెను పోబొమ్మ ♦ చెనఁటినుంచ
తగదనచు చంపకయె నెల్ల ♦ తరుణమందు
బ్రతికియుండఁగ జేసె ♦ నెప్పటికి నకట. ౩౧

శా. బెట్టేకెత్తఁగ వేల్పుటొజ్జచెలువన్ ♦ వేఁగూడు దోసంబులు
న్గాట్రేనింగడు దయ్యమంచనక పీ ♦ కన్నెత్తి శేర్మ్రాడుగుల్
దోట్రిల్లం జెలువంబు లూడినలుపెం ♦ తోబుట్టి నీ డెందముల్
జట్రాతిందగ నేయమేలగునె చా ♦ ల్చాలిట్టి సిగ్గించుమా. ౩౨

క. పులుఁగులు వేల్పులు నీపా
లుల వెసమొసవంగ తునుక ♦ లుం జేసిన నీ
కలిమి సెడి సిల్గవే మొగా
తొలిఁజేసిన బాగమునను ♦ దోడి బ్రతికితివా. ౩౩

తే. గీ. కన్నెమిన్నలనే చెడు ♦ కావలంబు
లంటగిట్టని వేలుపై ♦ యారనిన్ను
జేరికాల్చిన నలుపయ్యె ♦ చెలఁగిపజలు
మట్టియట్టను మాటలు ♦ వెట్టిఁగదుర. ౩౪

తే. గీ. కొసరుతో బుట్టువింటికిఁ ♦ గోడుఁగూర్చు
నటుల గోడును నాయెద ♦ నంటనేయ
చందమామనుమిప్పుడు ♦ చందమామ
తొగలవెత బాపినటుల నా ♦ తొగలఁబాపు. ౩౫

సీ. నిక్కమాదప్పదు ♦ నీయెదమసిఁగాను
నినునింగి సిగబట్టి ♦ నేలఁజరువ

నిన్ను పక్కలగమి ♦ నెఱినెఱితిని పోను
నీపాలు లింతింత ♦ నిచ్చెదరుఁగ
చవితినిన్గను పజ ♦ సంతుల పాల్గాను
పరఁగవున్న నులందు ♦ పాముగరువ
నీమేనయల్లుని నీటున్నై ♦ గాలిపోన్
నిన్గన్న కడ్పట్టె ♦ నీరుగాను

గీ. ఓరియొుజ్జలరాణిలోఁ ♦ జేరిమరుని
పోరుఁదీర్చిన నడిదోస ♦ కారి నిన్ను
నంటకావల మెల్లను ♦ నంటుగాన
నేను తలవంచెదను జూడ ♦ నిన్ను మామ. ౩౬

క. అంచీవరుసున కినుకన్
మించగఁ బోనాఁడితాలి ♦ మింగుండియలో
కొంచెముఁ బూనియు పొగడెద
మంచి నుడువుగమిని నంచు ♦ మడఁతి గునుపుఁగన్. ౩౭

ఉ. ముమ్మొనవాలుదారి తల ♦ బొల్పగు బంగరుమేటి కుళ్లవై
తమ్ములగొంగవై కలువదాటుల ♦ పెన్వగ బాపుచుండివిన్
దిమ్మరులున్నెబాసనఁగ ♦ దిర్పుచు ముజ్జగములెల్లులుంగు చో
మమ్మతిలంగ గాచియును ♦ మమ్ముల ద్రిమ్మట బెట్టకుండుమా.

క. అనిఁబొగడు చుండుతఱిలో
ననవిల్తుఁడు కేరివింట ♦ ననలల కోరుల్
బెనువడఁగూరిచి చెలియ
కున్నకును కను ♦ జూపులలరఁ గొనకొనివేయన్. ౩౮

ఉ. వేసిన వేటుతోడ వెర ♦ వేఁకియెుడం గడుబుట్టుచుండ తా
గాసిలి రొక్కచేడె చనుఁ ♦ గట్టులపట్టు నవేఁ బరుండి సె

బాసుర తొల్లి కాటిదొర ♦ పాలిట నీజవ యేడఁదాగె ని
ట్లేసుల ముద్దరాలివయి ♦ నేయఁగ నాయమయించువిల్తుడా. ౪౦

తే. గీ. నీలకోరులవలపులు ♦ నిలువలేక
బమ్మకతెవేల్పు కాల్రేడు ♦ తిమ్మగలుఁగ
నోటమొదమేన తమతమ ♦ బోటిరతన
ములనుదాల్చిరి మే మెంత ♦ పోటుకాఁడ. ౪౧

చ. దుగినుడు నీదు బెట్టిదపు ♦ ల్రోవలుఁ బోకడఁజూచి యోటి నా
లుగవియు పూవులైన యెద ♦ లోబడకన్ గచువంబెసంగఁగా
నెగులు కొనంగఁజేసితివి ♦ నీకవిగాటపు తూపులిచ్చినన్
జగములఁగాల్పవే వలపు ♦ సామినతంబు తలంపుసేసినన్. ౪౨

క. ఓరీ నీవలెబంటులు
లేరో నీవాకడవాకొ ♦ లేకున్నను విల్
దారిలి యిటు మిడిసిపడక
మేరటరా చెలుల నా యు ♦ మేరా నేచక. ౪౩

ఉ. నెయ్యపుతేఁడ నీకు జత ♦ నెవ్వరి పోటరికాఁడు లేడటం
చొయ్యన బెట్టిదంబుఁగొన ♦ నోర్చు రె పెద్దలు నేర్కైన మేల్
చెయ్యఁగ మంచిదంచు మఱి ♦ జెప్పిరి వెన్నఁటిమామఁగూడి యా
కయ్యముఁ జేయవచ్చెదవు ♦ గాయలుఁ జేరగ బొమ్ము జర్రునన్. ౪౪

చ. చిలుకహుమాయి ♦ చక్కెరల సింగిడి తేటులనారి కమ్మపు
వ్వులు ములుకుల్దలంపగను ♦ పూదటి కమ్మనిగాలి సిందు వె
న్నెలదొర వెంబడింపవల ♦ నెయ్యడ నీమొదగూడి తుల్వలై
కలువరమందఁజేసిరి వ ♦ కావకలుంగలుగంగ నిత్తరిన్. ౪౫

సీ. అక్కన తెల్లని ♦ యులరు సోగులుఁగావు
సొరది సప్పంబుల ♦ సోగులివిర

తళుకైనమేన గం ♦ దపుపూఁత యిదిగాదు
పలుమారుఁ బూసిన ♦ బసుపుమిదిర
కస్తురికుత్తుకఁ ♦ గైసేయు టిదిగాదు
విరివిగ రేకెత్తు ♦ విసముఁగదుర
తనరునొదలను గే ♦ దఁగిరేకిదియుఁగాఁదు
వరఁగలించెడు నెల ♦ వంక యిదిర

గీ. ఔర నేకన్నెనవి చాల ♦ గోరములను
బెట్టదవుగాని యౌ బళా ♦ గట్టువిల్తుఁ
డనుచుఁ దెలియుము నీమది ♦ కబ్బమొసఁగు
నేతలను నీయఁజెల్లుఁనా ♦ చిలుకరాత. ౪౬

శా. వీఁ కన్నెల్దుగనె త్తనీరసమునన్ ♦ విల్గంట్రడలై కూలు చీ
కాఁకా గుఱ్ఱము సుద్దులాడినను వే ♦ గఱెక్కముస్సుర్కునా
జోకాచూడ్కిని చూడ దండులెడయా ♦ సొద్దెంపుగా బి(ప్వనా
రాకయ్యానకు కాలుద్రవ్వఁ గలవా ♦ రాజిల్కపై నెక్కియుఱా.

తే. గీ. మూడుకన్నులవానితో ♦ మొనసి గెల్పు
లేని పోటరికాడవు ♦ లేమ లార
డములనొంటఁగ నేయగ ♦ డాకబంటు
మానసులఁజేయ నీకేటి ♦ మగటిమొరయు. ౪౭

తే. గీ. ఎలమి ఱెక్కము సిడెము రెం ♦ డేటఁగలువ
నీదు మావుచికాకంది ♦ నేలఁబుట్టు
గులనువేఁజేర నీకైదు ♦ వులు సతంబు
వడిఁ దొలంగుచుఁ బుడమిపై వాడిఁగూల. ౪౮

తే. గీ. నాదు ముక్కార్పునను నీదు ♦ నారివిప్పి
బెదరి వాపోవఁజేసెద ♦ బింకముడుఁగు

నా దుజడజూపి నీమూపు ♦ నక్కు నీ ద
ణాయుఁడగు గాలి వినుఁజేరు ♦ నాచనుఁగన. ౫౧

క. ఎన్నెన్నో నుడివినను నీ
కున్నన రెద నేలబుట్టు ♦ కుంకు టదేమో
కన్నెనుఁ దిట్టినఁ దప్పదు
వన్నియ నీమేను నీరు ♦ వలె నారోరీ. ౫౧

వ. అని యిట్లు కినుకాని దూటి యక్కటికమూని చొక్కు(పు)మాటల
వక్కాణింపుచు నిట్లనియె. ౫౨

క. జగముఁ గలిగించు బొమ్మకు
నొగి తమ్ముఁడవయ్యు నల్ల ♦ యొడలిదొరకు మే
లగు కొడుకవయ్యు నీ ము
జ్జగముల వలవందఁజేయు ♦ జాణవుఁగదరా. ౫౩

తే. గీ. అన్నిటుల బొగడినఁ గాని ♦ యంతకంత
కలరి వలపులరాయఁడు ♦ కలువతేఁడు
కాఁకులనుఁ బెట్ట వెఱగంది ♦ కనికరమున
చెంతనుండెడినే స్తపు ♦ చెలికి ననియె. ౫౪

ఉ. వాలుగడాలు ఢాకకును ♦ వాలెము నాదిడు తేటి మూకకున్
వేలుపు బువ్వ కాఁకకును ♦ వీవలిరాకకు సారె రేకకున్
బూలబిడారు జోకకును ♦ పొల్పుఁగు జిల్కల నోరుకూకకెం
తోలలిమించి కాఁక తులఁదూఁగెను నే నెటులోర్తు నే యిటన్.

క. హెచ్చరికఁ గాలి వీచెను
నచ్చలమున మరుఁడు నేచె ♦ నాకసమున చం
దెచ్చి చెలరేగె గాము
చ్చిచ్చొగినిటఁ గూడెనేమి ♦ సేయుదు చెలువా. ౫౬

వ. ఇట్లు మతకరి వేల్పు రూపు తన కనుంగవకుఁ దోఁచి మఱియు చెలువ కిట్లనియె. ౫౭

క. నిక్కి చనుఁగంటలుబ్బ ప
టక్కున లలిఁ జెకపికిలె ♦ కవకవరింగుల్
స్రుక్కనల కొప్పుఁ జారెను
గ్రక్కసమున పోకముడి బి ♦ రానను వీడెన్. ౫౮

ఆ. వె. అంచు కల్కియుల్కి ♦ వినఁబల్కి చెలికి తా
తావిపూవు లలరు ♦ తీవెయింట
పట్టుపాన్పుపైన ♦ పట్టుదప్పిన కీలు
బొమ్మవగిది వ్రాలె ♦ పొంకముడిగి. ౫౯

ఉ. వ్రాలినతోఁడనే చెలులు ♦ వారని ప్రేముడి మేరమీఱఁగా
పూఁ సురఁటి వీచుచును ♦ పువ్వులు కస్తురి కప్పురంబు మే
ల్గాలిలు జవాది మొనలంది ♦ క్రన్నన గొంతెనుఁ జోనఁ జేయు మేల్
నీలిసిగల్ మసన్వలప ♦ నింగడు సేసిన కుబ్జచేడెయున్. ౬౦

క. కనుగవ విప్పుచు నల్గడ
లనుగన్గొని మైవడంక ♦ లంపటమున మో
మున చెమట చెమ్మరింపఁగ
దనసకులనుఁ జీరి మఱి వి ♦ తాకునుఁ జెందెన్. ౬౧

వ. జెందిన నమ్మలక్కలొక్క చక్కటి కేతెంచి చిక్కుబడియున్న యక్కొమ్మం జూచి చెక్కుచెదరి యొక్కరొక్క రొక్కరొక్కరి మొగంబులు జూచుచున్నంత నొక్క టక్కులాడి యక్కలికి గ్రక్కతిల్ల మొక్కచెడిన తోడిజోటులతో నామాట పాటించు డని యిట్లనియె. ౬౨

ఆ. వె. అలమటించ నేల ♦ యతివలు వినుఁడి యీ
చెలువ చెలువ మలరు లలరుఁదోఁట

లోఁన ద్రిమ్మరిల్లఁ ♦ గా నింతఁగల్గెహో
దీని కేమి వితము ♦ తెలియఁగలరో. ౮౩

వ. అనిన నొక్క మచ్చకంటి నెచ్చెలులతో నిట్లనియె. ౮౪

క. ఓసకియలార యడవిపి
సాసి చెలియమేను సోకె ♦ సరికన్నయ్యన్
వేసదివి బొట్టుఁ బెట్టద
నాఁ సరియన నిచ్చపడిరి ♦ నాతిరతనముల్. ౮౫

వ. ఈతీరునఁ బొట్టుఁబెట్టి తెలివిడిసేసిన లేపకున్న నొక్కచాన జాణ
గాన జాణలగు లతకూనల కందఱి కిట్లనియె. ౮౬

క. వుం డొకటి యున్న మం దొక
టిండాలుగఁ బెట్టినన్న ♦ తేవను నవలా
కుండువెత రొకటి మన మిట
నిండారఁగఁజేయు టొకటి ♦ నీతకములచే. ౮౭

ఉ. హెగ్గడికత్తె లప్డు వల ♦ హెచ్చిన కుబ్జనుఁ జూచి జంకునన్
దిగ్గనలేచి మంతనము ♦ తెల్పెడికై మఱి లేవనెత్తుచున్
బిగ్గఁగ కౌఁగిలించి విరి ♦ వింగల చెక్కులచేత నంటి నీ
యొగ్గతమాడువక్కణము ♦ లేమొయొయారి యొయార మొప్పఁగన్.

తే. గీ. తెలుపు దెలిపిన నీవగ ♦ దీగునమ్మ
దలఁచియుండిన దాని చే ♦ తనుఁకు గటుఁగు
నమ్మ లోలోన కుముల నా ♦ యమ్మ కొమ్మ
కతనుఁ జెప్పుము వన్నెబం ♦ గారుబొమ్మ. ౮౯

తే. గీ. పసిఁడికిని సరదుఁగలమేయి ♦ వసలుఁ జారె
పసితనంబున కెదలోన వినుకుఁ గదిరె
తొఁగలవిందును బోలిన ♦ మొగమువాడె
తొఁగలనొందకఁ జెప్పుమో ♦ తొఁగలకంటి. ౯౦

సీ. దొండకెమ్మోవి నీ ♦ దండకు చిలుకలు
జేర మేల్చదువులఁ ♦ జెప్పవేల
నలఁమబ్బు కీల్గంటు ♦ నమిలి పులుంగుల
జేరి చిందులుద్రొక్క ♦ జెప్పవేల
యసలుపుట్టుఁగుకంటి ♦ వెసతెలిపిట్టల
జీరి మేల్నడకలఁ ♦ జెప్పవేల
చిగురాకుబోడి నె ♦ చ్చెలిమి కోగిలగుంపు
జీరి మేల్పొరములఁ ♦ జెప్పవేల
గీ. విరియఁబారిన పిరజాది ♦ విరుల పొగడ
పొన్న గేదఁగిమల్లియ ♦ మొల్ల జిలుఁగు
గన్నెరులపూల సోగుల ♦ కారుకొరు
మొగుల కీడఁగు కీల్జడ ♦ ముడువవేల. ౬౧
సీ. రంగుమేలిమి మేన ♦ బంగరుసొమ్ములు
బెట్టక నీ విట ♦ బెదరనేల
చిన్నిమొగంబున ♦ వన్నెకస్తురిఁబొట్టు
దిద్దక నీ విట్లు ♦ త్రిక్కు-లేల
కుతుకసారంబున ♦ కులికెలఁ బడవీనె
సారెలగీటవు ♦ సరమదేల
తియ్యన కమ్మనఁ ♦ దేరిన నుడువుల
మాతోడ నుడువక ♦ మసలనేల
గీ. గందమును వచ్చకప్పుర ♦ మందముగను
చేయ దమ్ములనక్కు-న ♦ జేర్పవేల
లేచి పూపొదరిండ్లలో ♦ లేను తొగల
మేలుగా గూడి నడువవి ♦ దేలఁ గోల. ౬౨

ఓరుచు గొమ్మగోడు తెద ♦ నొయ్యన పూవులమాలె లక్కఁనన్
చేరుచు గొమ్మలో దలఁపు ♦ చెల్వపుచేడెల కెల్లఁ దెల్పెడిన్
దారిచి పూలవిల్తునకు ♦ దక్కఁవకారులఁ జెప్పి నిల్వఁగా
నేరుపు జాలకున్న విను ♦ నెవ్వగలు న్మది నుండునో చెలీ. ౯౩

ఇటువంటి గుట్టు లున్నను
కటకట మాతోడఁ జెప్ప ♦ కను నీ విపుడె
చ్చటనైన నుండుదానవొ
తటకున వివరింపవమ్మ ♦ తళుకులబొమ్మా. ౯౪

గీ. అనిన తా విని తలవంచు ♦ కొని యొయ్యారి
కాలు చిటికెనవేల్ గోర ♦ నేల వ్రాయు
చును కనుఁగవను కన్నీరు ♦ చనులదంట
కొప్పరంబులఁ బడఁగ వా ♦ కొనె ముదుంగు. ౯౫

చక్కరవింటివాని పెలుచ ♦ న్గెలువన్ దగు గట్టుఁ దాల్పరిన్
జొక్కులుమీరునట్టి నుడి ♦ చొప్పులఁ జెప్పి బిరాన వాని నా
చక్కికి వచ్చునట్లుఁ గను ♦ సయ్యస జేసెదనంచు నేగిరా
దక్కను తుంటవిల్తు బలు ♦ దాడికి గుందితి నెట్టులో చెలీ. ౯౬

గీ. అందలేనట్టి ప్రమానుపం ♦ డందజోపు
మాడ్కి కలుముల పడఁతికి ♦ మగఁ డనంగ
వెలయు ముప్పోకలానినే ♦ విరిలకోరు
కాని పోరున గవయుఁగఁ ♦ బూనుకొంటి. ౯౭

గీ. ఎవరు నాకోర్కి దీర్ప ము ♦ తేఁగగలరు
ఎవరివేడుదు నిచ్చట ♦ నేలికైన
చెలిమి చేడియ మిన్నగు ♦ చెలువ పద్మ
నియిటఁ గలిఁగిన నాకును నెమ్మి పొసఁగు. ౯౮

వ. ఇట్లు నెచ్చెలియలతోఁ గుబ్జ వాకొనుచున్నంత కలికి గోసంబులు గలుఁగు చంద్రముఖి యను మెలఁత యిట్లనియె.

ఉ. పాటివలంతులీ వలపు ♦ సాగిన బెంగను బెట్టు కుందు రే
తోఁటను ద్రిమ్మరిల్లుతరి ♦ తొందరలుం బకువారలుందు రే
మాటికి మాటికిన్నరుని ♦ మామను పుల్గులఁ గాడ్పుఁ జూచి యా
రాటము డెందమందిడవ ♦ రాకిది గల్గకఁ బోవుటెట్టులక్. ౧౦౦

శా. ఔనే యెంతలుఁ దెచ్చుకొంటివిక నా ♦ హా యేమనన్వచ్చు నీ
కీనేలన్ జతయైన జవ్వనులులే ♦ రే వారలీ వింతలా
వైనంబు న్వినవిన్న నవ్వెదరు తే ♦ వన్వేగిరంబుం గొనన్
గానాయంబునుఁగాదు నూరుకొనుమా ♦ కన్నయ్యతోఁ దెంచెదున్.

ఆ. వె. అనుచు వలపుమీఱు ♦ నతివెకు మేలైన
నుడులు కొన్నినుడివి ♦ యుడుకు దొలఁగ
జేసి మెలఁగిరచట ♦ చెలఁగి కన్నయ్యకై
తరలిపోవు నవల ♦ తాఱుఁదాక. ౧౦౧

వ. అట్లు ముగుదలు వినిపించిన పూదోటలోఁ గన్నయ్యవలపులం బడి దిరుగుచుండె. నచ్చోట దేవకికొడుకు కుబ్జ మువ్వంక లెగయఁజేసి కమ్మచ్చు పోసినబంగారు తీఁగమాద్రి నలరారు కన్నెక నెగాదిగ కన్నుల పండుగుగాకనుం గొనునది మొదలు జగము తండిరిండెం దంబు తామరపాకున జలకంబు లాకునంటక చెదరాడువగ కమ్మ విలుకాని పువ్వుటమ్ములకు సొమ్మసిల్లి యుల్లంబు తల్లడిల్ల నన్న తోనున్న సకులతోఁ రాచదారిం బోయిపోయి విలుగీముఁదరి యంజొచ్చి నుగ తాణివింటి కై వడి పెద్దదియై బీరముగల మగలకు దాల్పుటకు ద్రేఁకయై యలరారుచున్న సింగాణికి యచ్చటిపజలు వలదువలదనంగ నారిమోపెట్టి ఖణేల్ ఖణేల్ మనునాదు నలుదె సలఁ జెలరేఁగ రెండుగండ్రికలుఁ గావించె. అత్తుండంబు లన్నదమ్ము

లుచేగొని నచ్చోటి కాపరిపజలు వజీరులు గరువించి చుట్టుముట్టిన మట్టుఁబెట్టి రాచకొలువునకు జనుచుండు ద్రోవ కువలయాపీడ మను నేనుంగును యశోదకుఱ్ఱనిఁ బరిమార్చుటకై నిలువ నయ్యదిమస్తి గలిగి మావంతునంకియకు నిలిచె నంతకుముందు కనకతప్పెట గుమ్మటకై ముడి నగరతుడుము మొదలగు చప్పుడులచే మ్రోగు చుండునదియు చాణూరుఁడును ముష్టికుండు నరిష్టుఁడు మొదలు మల్లడించెడుకొలంబుచేతఁ దింద్రడించునదియును కప్పురముపునుఁగు జవ్వాదిమలాక పూనీరుకలిపి దుమారము లేవకుండునట్లు చేసి నదియు బొండిపిరాళ్లు వయ్యలు మిట్టుపల్లంబులు పుట్టలుగోలె తే కుండునట్లు కోమలికంబుగా నుంచినదియు పడగజెండాలు పువ్వుల మాలెలతో బురణింపసేసినదియు నేలవేలుపులు రాచలు కోమ టులు నాలవకొలంబువాగు నన్నికొలంబుల వారితో మ్రోగు చున్న నొంటియుడుగు కత్తెరనేలకుం వెన్నుండన్నతో నరుఁగు చుండ రాచమిత్తలు పురికొల్ప మదపుటేనుఁగు బరికాని యానచే నెదురించిన వెన్నుం డిట్లనియె. ౧౦౩

తే. గీ. ఓరియేనుఁగు గాచెదు ♦ కారుచదుగ
మాదెసకు నేగుదెంచుట ♦ మంచిదటర
మరలఁగా జేసి బ్రతుకుము ♦ మరలవేని
తప్పదిక చావునీకు పె ♦ త్తనముచేత. ౧౦౪

చ. అనవిని మావటీడు మురు ♦ వారఁగమీఁదికి ద్రోలినం గనుం
గొని మొలపొన్నుకాసెనల ♦ కొప్పును బిగ్గఁగఁ జేర్చి వెన్నుడున్
గనలుచు తొండమంది నడి ♦ కారము నొప్పపజల్ వినంగనం
దురిమొకు పల్లవన్ బెరికి ♦ తోడ్పడు వాకు బలారెయంచనన్. ౧౦౫

వ. ఇట్లు గజేనుఁగునుం బరిమార్చి దాని నిడుదలై తెల్లనైయలరారు రెండుపళ్లను బెరికి చేపట్టి రాముండును కృష్ణుండును మావటిని

బీరముఁగల ప్రజలను రాచవారిదండును ముట్టుబెట్టి వచ్చుచుండ
తోటిరాచ లిరుప్రక్కలం గూరిచుండి పలువితంబుల మాటలాడు
చుండనొక్క పెద్దమొచెయుంచలి తళతళమను మాతాబిఁగూర్చిన
పట్టుతివాసి యందుపైన జల్లేడదూది చెముఖు మాయలుదిండ్ల
యెత్తుగా మెత్తదలక్రై నతికించిన దానియందు బసనేసి చుంతి[illegible]గమి
పుడమి తేడు లొనరించిన తప్పొప్పులెల్లఁ జెప్పి వాటితగిన మంచి
చెడ్డలు వినుపించుచుండ నందు ముష్టికుండరిష్టుండు చాణూరుఁడు
మొదలగువారున్న యెడ మనువు పరువునేలను కుప్పించి పెనువెల్లి
తీగిని ముజ్జగంబుల చెండు చెండాడనిలిచిన మిత్తిమిత్తి గొంగల
తెరంగున సప్పళింత సేయుచు తాటికి నెత్తువచ్చు గూపులతో నెత్తు
రుఁగ్రక్కగను గవలతో నన్నెల నడ్డపాటులేకుండ పచేరంబు సేయు
చున్నవారిం దరిఁజుం జొచ్చి గట్టు గట్టుపోలిక కోల్పులి కోల్పుల
మూపరి యేనుగు నేనుంగు చందంబున సింగంబు సింగంబుతీరు రెట్ట
బలిమగల బలిమికాండ్రఁబట్టి మిట్టిపడుట పట్టుదలయేయని కేలున
కేలు గీలించి కాలుకాళులం జొనిపి పడదిగిచి పేర్చియూర్చిన నయ్యి
ద్దరు గ్రద్దనపిరుతివక పిడికిటి బొడుపులకున్ జెదరని యెదదగలిఁగి
యొరసాగించి తెరలక మరల పొరలఁద్రొబ్బిన వెన్నుండు తనయే
నుగు తొండంబులబోలు కేలుదంటసాచి మగరాలవలె కటికెతనం
బుగలదాయ నొడలి పిడికిట విడువక పొడుచుచు నడుగులం బట్టి
నాయంబు [illegible]ప్పక నడుగిడుచు నడుగులం బట్టి ముమ్మారుఁ ద్రిప్పి
నేలపై జరిచిన మోములనుండి నెత్తురుల గ్రక్కుచు జేజెల పట్టుం
జేరం జనిరి. నత్తం రోహిణికొడుకు నట్లే యొనర్చిన జగంబులెల్ల
గొనియాడ నందుడు మొదలు కొలువువారందఱు కంసుని సరసనఁ
గూరుచొని చూచుచుండిరి తరువాత నిదురించి యా కటితో లేచి
కొండసారంగంబు పీడిన సింగంబు చందంబున కటిపజలను తెగ

టార్చి కన్నయ్య సింగంపుపీటపై మల్లులు తనను కారియబెట్టక నికరంబువదిలి నూచుచున్న కంసునిగాంచి యుబ్బుబ్బా యీడాదుస్డ గీడు నా కొరకు నా తల్లితండ్రుల కారంజేర్చి రాచలచ్చిమి పెను వ్రేఁకను దాల్చుటకై తండిరియగు నుగ్రసేనుని చెరసాలనుంచి తన యిచ్చతీరునట్లు దిరిఁగెనని దాపుంజేరి బొమిడికంబుపై కేలు దమ్మిఁ జేర్చితిగిచిదలవెండ్రుకలంబట్టి నేలకీడ్చిన వాడంతకు ముందె కన్నయ్య రూపునుగాంచినంత చిత్తవలెదోఁచి మోము డంబంబుదప్పి తేజులేకనుండె నతని ముట్టినంతనె నసువులవీఁడి వినువీఁడు సుగంబు జూడంబోయె వానితమ్ములును జరాసంధుడు పల్గాకి పజల నైదుకొని కాలయవనుడను తురుక యేతెంచి ముట్టడించిన కయ్యంబున తీరుపాటుగావించి మధురనువదిలి సందరంబులో ద్వారకయను పేరిటితో రాచనగరు గావించి నందు సుగంబున్నై భోజకొలంబునకు పులియగు నుగ్రసేనునికి మరలి రాచలచ్చిమిని కట్టించె తన తల్లిదండ్రుల చెరవిడిపించి సుగంబుండ నొక్కవాడంతిపురిని మెత్తని సెజ్జపై బరుండి కుబ్జ చేడియ కనుదమ్ములఁ గట్టినట్టైన కన్నయ్య. ౧౦౬

సీ. క్రొల్గంటి మేటి సిం ♦ గారంబు దలపోయు
జవరాలు రూపు న ♦ చ్చముగ నిలుపు
చిలుకలకొల్కి మ ♦ చ్చిగ మాటలో నెన్ను
కన్నియ కోమలి ♦ కము దలంచు
తెలిగంటి వగటు నొ ♦ ద్దికతోడఁ దూఁకొను
కప్పురగంది చ ♦ క్కదనమెంచు
వలఁతి మేన్వలపుల ♦ వహనుఁ గొనియాడు
సోఁగకన్నుల మది సొక్కుదలఁచి

గీ. మగువ తిన్నని మోము తా ♦ మర మిటార
మునకు మెచ్చును మాటల ♦ పొంతనమున
కెడద సంతోసమందు విం ♦ దేర్పడంగ
లచ్చి మొగడిట్లు తలఁపు త ♦ లంచియుండె. ౧౦౭

క. తోలఁగున్నడబకు బెచ్చె
మెలఁగున్నదు చందిరికను ♦ మేల్ మేలనుచున్
కలగున్మరుని, తలంపున
కలగు న్మేన్పడక జేర్చి ♦ యలసట నొందున్. ౧౦౮

వ. చెఱుకువిల్తుండొాఱ బెటికి గఱకటిగాక కఱుకు మెఱుఁగు గొరకల కఱఁద దూరనాటినఁ బసచెడి దనయింటి చేరువకుఁ వేరువడక సారువలుఁగల పూఁదోఁటలో సారెసారెకు దిరిగాఁడు మరుని వారువముల పారువముల గోరువంకలతో రాగిల్లు పూవులకోవుల మావుల తీవియలనుఁ జూచి కళవళింపుచు నొక రాయబారి నంపుటకు తలంపుసేయు నంతలో కుబ్జవెలందితో యానొంది యేతెంచిన పద్మిని రాణివాసంబున కాసంతైన కన్నయ్య జాడ లెరుంగక తోడి ప్రోడలకు వీడియంబులొసంగి పోడిమిగల వేసు కల నాడుచు తెరువెఱంగె. ౧౦౯

తే. గీ. అంత పద్మిని నాచెలి ♦ యలరువిల్తు
తండ్రికడ కేగుదెంచి వి ♦ తాకునొందు
చెలువ వక్కాణమంతయుఁ ♦ జెప్పుటకును
కేలుమోడిచి యిట్లు న ♦ గ్గించె బగితి. ౧౧౦

(కందగీత గర్భ చంపకమాలా వృత్తము)

కదు॥ కఱివేలుపా। గవురు। కన్నఱ। కొనలగాలిమి త్తన
ల్గడ। దవురా। మసన్మొగులు గచ్చునికొమెయి మురువ్వకాడప్రే।

ముడి। నెఱితో। నెదందలఁతు। ముప్పరిపోకలతారువాడపాల్।
కడలి బసా। జగా గొనము। గైకొని బ్రోవుము కోర్కెలూరఁగన్॥

క. కఱివేలుపాగవురుక
న్నఱకానల గాలిమిత్త ♦ నల్గడవురా
నెఱితో నెదం దలఁతు ము
ప్పఱిపోకల తారువాడ ♦ పాల్కడలి బసా. ౧౧౨

గీ. గవురుకన్నఱ కానల ♦ గాలిమిత్త
మొగులు గచ్చుని కొమె యి ♦ ముర్వకాడ
దలఁతు ముప్పరిపోకల ♦ తారువాడ
గొనము గైకొని బ్రోవుము ♦ కోర్కెలూర. ౧౧౩

(చతుర్విధకందగర్భ ప్రమితాక్షరవృత్తము)

నెలప్రొద్దుకన్నుఁగవ ♦ నిగ్గులమై
కొలమ్రబ్బుపైరగురి ♦ గొట్టెలమిన్
గలనీరు వామియులు ♦ గల్గు లలీ
నలవేల్పనే గొలుతు ♦ నాకలిమిన్. ౧౧౪

(ఇందు ప్రతిచరణమాదిగా చతుర్విధకందములు జనించు)

గ. ప్ర. కం. నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలమ్రబ్బుపైర ♦ గుఱిగొట్టెలమిన్
గలనీరు వామియులు గ
ల్గు లలీనలవేల్పనే గొ ♦ లుతు నాకలిమిన్. ౧౧౫

గ. ద్వి. కం. కొలమ్రబ్బు పైరగురి గొ
ట్టెలమింగలనీరు వామి ♦ యులుగల్గు లలీ
నలవేల్పనే దలఁతు నా
కలిమిన్నెల ప్రొద్దుకన్నుఁ ♦ గవ నిగ్గులమై. ౧౧౬

౧. తృ. కం. గలనీరు వామియిలుగ
ల్గు లలీనలవేల్పనే గో ♦ లుతు నాకలిమిన్
నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలమ్రబ్బు పైర ♦ గురిగొట్టెలమిఁక. ౧౧౭

౧. చ. కం. నలవేల్పనే గొలుతు నా
కలిమిన్నెల ప్రొద్దు కన్నుఁ ♦ గవ నిగ్గులమై
కొలమ్రబ్బు పైర గురిగొ
ట్టెలమింగల నీరువామి ♦ యిలు గల్గులలీ. ౧౧౮

(చతుర్విధకందం)

౧, ప్ర. కం. వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి ♦ వాడిమి నెసగన్
బెరసుపజజదిపి యెలమిని
విరివిసి సనిబుడమి కిచ్చి ♦ వెలఁగితివి సరిన్. ౧౧౯

౧. ద్వి. కం రుసిగమిని బ్రోచి వాడిమి
నెసఁగన్ బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిన్
సనిఁ బుడమి కిచ్చి వెలఁగితి
విసరిన్ వరుస మనిచితివి ♦ వెసదేవరలన్. ౧౨౦

౧. తృ. కం. బెరసు పజజదిపి యెలమిని
విరివిని సనిబుడమి కిచ్చి ♦ వెలఁగితి విసరిన్
వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి వాడిమి నెసఁగన్. ౧౨౧

౧. చ. కం. సనిబుడమి కిచ్చి వెలగితి
విసరిన్ వరుసమనిచితివి ♦ వెసదేవరలన్
రుసిగమిని బ్రోచి వాడిమి
నెసగను బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిఁ. ౧౨౨

(మత్స్యబంధము, భద్రికావృత్తము)

రార కన్నయ మాటిమాటికీ
కోరిఁ జేరితిని మేరగా
గారవించి కొలఁద్రోలఁగా
మేరయారయెద నెంతురా. ౧౨౩

(ఖడ్గబంధం, సుగంధివృత్తము)

ఏటిబోటి మేటిలోన ♦ నిక్కనిక్క చక్కఁగా
గాటమైన నీటిబండు ♦ గట్టుదారి యేలికా
కాటితేఁబుబమ్మఁ గొల్వ ♦ కల్మి నిచ్చి బ్రోవఁగా
గాట మిచ్చు నీటిచాగి ♦ కాహళాంగరంగుమైచొకా. ౧౨౪

(మర్దళబంధము, మావకణవృత్తము)

మేలుగడించుదు సాఁకన్
గ్రాలగ పక్కిమానుమాయిన్
మేలుగ నెక్కి మానుసారిన్
చాలగ బ్రోచెదుమా-రా. ౧౨౫

(కూర్మబందము జలదవృత్తము)

కారడి మేల్మెఱుంగు మెయి ♦ కన్నయ సిం
గారపు హారాన్నకోక పర ♦ గన్వెనుకన్
దారవెదాయల న్మెదుప ♦ దాఱుజగా
మేరలుపాముకన్దపులి ♦ మెల్పుకుకో. ౧౨౬

(కుండలిబంధం, ఉత్పలమాలావృత్తము)

బంగరునక్కసాలు వలె ♦ వాటు తటుక్కన వెల్గుసామిలె
స్సంగలవారు బత్తిమద ♦ సంతసమై లలితారుచు న్మసన్
రంగ నినుం దలంచిరి స ♦ రాసరి గచ్చగుసున్న చిన్నిటెం
కింగొన బ్రోవుమయ్య గిడి ♦ గిళ్ళకిలార్చిన తేఁకుచేగమై. ౧౨౭

## దండకము

సీరామవేల్పు బయల్జేజెఁయుం బమ్మముక్కంటియుం దుగ్గిజక్కు-
ల్మొదల్గా జగంబంత నిన్నెన్నగాజాలరే కాఁరుసి సీతలుం బత్తులున్మె
చ్చఁగా నేయుదెల్లన్న తొల్రూఁపుమేస్మనులో మిన్నవై చాలప్రాగల్బ
ముందోచు ప్రావేల్పునుంబట్టి వాలారుముక్కంటు కొముమ్మందగన్గి బుమ్మ
యాబొమ్మకున్మేలు నొండంగవేసేసితో వేల్పుఁటుం రక్కసుల్గూడి
పాల్వెల్లినిండ్రచ్చుచో నీటుతా మేటిలో మేటివై కవ్వపుంగుబ్బలిన్వీపు
నం దాల్చి జేజేలబువ్వ న్వొసన్దీసియుస్పంచితో, జాళువాకంటిరాకాసి,
నేలన్వడిన్జుట్టి సంద్రంబులోవైవగా జన్నపుంబందివై వాని మారా
ముగుర్తించి మన్నిందొలంగించి నీకొరచే నేలలేనత్తితో, కుఱ్ఱసంబట్టి
చెడ్పాటుగావింపకంబంబు నన్మదిమె సింగమై, క్రిందుపాల్మోసనింబోలి
బొమందితొల్వేలుపుం బట్టియుం డొక్కనుంజీల్చి రోసంబు పెల్లారఁగా
రాబ మొప్పంగ దేవళ్ళనుంగాచితో, గోచిబొవండవై మూఁడుపాజ్జల్ప
లిన్వేడి, నీ నేర్పునుంజూపఁగా బొమ్మగుద్దుంగడున్నిండి మూఁడజ్జలం
జూపితో చేతిగొడ్డంటుముయ్యేడుమారుల్ సెట్రెంయులంగొట్టి యానె
త్తురుం దండ్రికిన్ బిండలిన్వైచి, రాయాదలల్ గూర్చి జేజేలమెల్పుక్క-
కిన్ దంతియుల్గట్టి పంపందితో, చాలుగా తెలురున్వ్రాల్గు పేరింటిరా తేనికిం
బుట్టి రాకాసినింజెండి, జన్నంబునుంగాచి మేల్వాజ్జలంబుట్టు దుబ్బన్గలు
న్నాతిగాఁజేసి యున్నేలచూలిం గడుంబెండ్లియైమించి రాదారిలో కా
వరంగల్గు పాఱున్ గ రాళించియుప్రోల్బలునుంజీరి తాసయ్యయానన్వడిన్
లంకలోఁజేర సన్నాసులుం బొమ్మచారుల్ సిరాబారులుంగొల్వగా
నాకుపాకన్ దగంగొన్నినాళ్ళుండి యచ్చోటునుంబాసియుం సీతఁగో
ల్పోయి తోఁబుట్టువుం దోడురారుస్యమూకంబుకుంజేరి రేకంటుమేపు
ట్టువుంజూచి నెయ్యంబు నాటించి ప్రమ్మానిమ్మరుల్గొల్వ సంద్రంబుపై
వం తెనంగట్టి రెండైదులెక్కన్దలల్గల్గు రాకాసిసింజంపి వేవానిపైదో

దునుకఁ జేనిగావించి యున్నెలచూలిన్వెసంగూడియుం బువ్వకంబెక్కి దమ్ముమ్రుంతునుం గొల్వఁగా పీటకై వచ్చి సంతోసమున్ ముమ్మతిల్లంగ చుట్టుందురా రాయలుం గప్పముల్వెట్ట, పెంపొందియుం బత్తులంబ్రోచితౌ, నల్లవల్వన్ మొలందాల్చియుం బైడిచూలాలిబన్వ్వఁ దోలంగిం పరాకాసిపాలఁ దగంబుట్టు రారాజులం గొంతిమేప్పుట్టుకల్ బాసటం గల్గఁగాఁగ్రుంచి నేలన్ నతంబచ్చగాదిగ్గకన్నయ్య వైచాలఁ గ్రొల్గంటులంన్నేలవా చాలవాఁబ్రోవఁగా, నీవుమేల్మేలుగా బుద్దరూపుంగడుందాల్చి సద్దాఁలా మేటివై దాయలంబోరు సందారుసంగొవ్వఁగా రావిమ్రాలోన్నెసలోఁదూఱి ప్రావేల్పుయోయూరులం గొప్పఁగాదప్పులుం లేని మేల్నోములున్నోచఁగాఁ జేసి యున్వారిబన్నంబులం బెట్టి మువ్వీటిపేరింటితోల్వేల్పులం గ్రుంపగా గ్రెంపఁగా జిల్వరాదాల్పుకై బాసటన్ జూపితౌ, తేజిపై నెక్కి యుండాఁ మీఁరంగ చెన్నంటులౌ తేసులం జీల్చి నాయంబులం బంటపూఁబోఁడిప్పి నాల్గుహజ్జల్ వడిన్నిల్పితౌ, నీకడింద్రైనచెయ్యేల్ దలంపఁ సురన్మ్రత్తికై గ్రాలు నిన్నున్నుతిన్గొందరున్ వేడ గుల్నెరకన్ దొడ్డుగా బిడ్డలన్గొడ్డులన్, మేడలన్మాడలన్గోడలన్జెడెలన్, కుజ్జలంబజ్జెలం గుర్రముల్ గల్గు కల్మిల్ తిరంబంచు వేసమ్మిము త్తింగొనంలేక నేలన్నుతింబుట్టి చావొప్పఁగా వెండితాఁబుట్టుచున్ జచ్చుచున్ దుంతరాతుండుపట్నంబుకున్ నేలకుంటర్గగా లేక సన్నెఫ్టుజోగుల్ తలంపొప్ప జేజేలుతోల్వేల్పువేఁగంటి చౌఁగంటి రేకంటిమేపుట్టు వాకోననాయండు నీర్వామిరాయండు మేల్లేటిబాబాయు కాసెద్దడింగాచు విస్ద్రిమ్మరీడున్ మొదల్ గల్గువారెల్ల విన్కెంపుజాబిల్లియున్ జక్కటుల్పక్కిముల్సొందెలున్గందు పుల్కారులున్వెద్దెలు గ్రొబ్బద్దులున్మ్నుక్కలు న్గబ్బముల్గొలె నాఁబమ్మగ్రుడ్డంత నీవంచు వేగుండి యున్నమ్మి నీతావునుంజూచి వేతారుచుండంగ మొల్నాటికై మేటివై యుండుకన్నయ్య నిన్నెడ్డు నీచిన్నెలన్దప్పకన్నెంచు నాకన్నకున్నీదు చెన్నుందగన్జూపి కావంగదె లచ్చిజేడా, జగాపక్కిగోడా జొహారుల్ జొహారుల్జొహారుల్జొహారుల్.

చ. సిరిచెలిమించుగా బొమలు ♦ సింగిడిగా బలులోతు సుద్దులో
యురుములుగాఁ జెలంగి జెలు ♦ వొప్పెడినల్లనిమేనుమ్రొ
బ్బుని బరికపుసోనలం గురియ ♦ బల్మొరుచేడియవానకోయిలన్
హాయువుఁగ జేర బ్రోవుము జొ ♦ హారులు వేలకొలంది సేసెదన్.

వ. అనిసంబరంబున నక్కఱితేవేల్పుం జేవగా నగ్గించి తన దేవెరి సుద్దివినం
జెప్పఁ జిలుకపలుకులకు సరుదుగల నుడువుల సిట్టనియె. ౧౩౦

సీ. వలవంతకారగ్గి ♦ వలన బుట్టినరోజు
వదలిన కెమ్మోవి ♦ పట్టువార
కాటుక నెరయంగ ♦ కన్గవజలకంబు
కాలువలగుచు చ ♦ న్గవను బాఱ
చెక్కుటఁ జేర్చిన చేదమ్మి ♦ కాఁకచే
మోము దామర నీటు ♦ ముసుఁగువడఁగ
పలుమారు ననపిల్లుఁ ♦ డలరుతూపులఁ గ్రుమ్మ
కదలనిగుండె చీ ♦ కాఁకుఁగాక

ఆ. వె. సవతిమీర మోము ♦ ననుచెమ్మటలు వాఱ
తలఁపులోన నిన్నుఁ ♦ దలఁచి తలఁచి
గువ్వగుత్తి కొదవ ♦ కొన్ని మెల్లనుడువుల
నిన్నుగూర్చి చెప్పి ♦ సన్నుబంచె. ౧౩౧

సీ. ఇగిరించులే మావి ♦ చిగురులచే సొక్కు
కోయిలఁ జేరునే ♦ కొడిశలకును
మిన్నేటి నీటిలో ♦ మేలుగా దరివెను
యంచలు చేరునే ♦ వెంచలకును
చందురుమామ మేల్ ♦ చంపరి కనుదిను
యేగునే నెలఁత్రావుఁ ♦ డివములకును

నీటిఁబుట్టుఁగు కమ్మ ♦ నీరుఁద్రావుచు చొక్కు-
తుమ్మెదలేగునే ♦ తుమకి గమికి

గీ. నీదుబాగైన యడుగుల ♦ నీరుపుట్టు
వులను నీనవ్వ నీపాట ♦ లలరురూపు
లందె నాబుద్ధినిలిచె నా ♦ కన్నులవయి
నాసఁజేరదు నీయందె ♦ నచ్చియుండె. ౧౩౨

తే. గీ. మున్ను కలఁగ్మల (పోయాలు ♦ చిన్ని బోర
నిలచి మనవుము నన్నని ♦ నిన్ను వేడి
మరల నీ యంజదమ్ముల ♦ మగునకెలమి
కొసరి యంజలి బుకారము ♦ గోరెగాదె. ౧౩౩

తే. గీ. వేలుపుల గాచుదేవర ♦ వితను నీవు
నిబ్బరంబున నీకేలు ♦ గబ్బిగుబ్బ
దుగలఁ దలపైనిబెట్టినఁ ♦ దొగల బాసి
నేను మనియెదనేల బి ♦ రానరమ్మ. ౧౩౪

క. నినుఁజూచు కనులతో చ
క్కని వెయ్యవియైనఁ గాని ♦ కననోడును (గ
క్కున నీకని పెంచిన మే
యిని నోరులం జేర్పనొల్ల ♦ దెల్లెడనైనన్. ౧౩౫

ఉ. సింగముఁబోలు నెన్నడుము ♦ చెందొవరాయనిమించు మోము మే
లుంగడకంటి చూడుకుల ♦ లో జగమంతయునంకె జేయుచున్
బంగరు దుప్పటంబువలె ♦ వాటుగ వేసిహారంగుమీర నా
కుంగనుబడ్డ రూపుకులు ♦ కున్మటిఁ గాంచగ నిచ్చజేసితిన్. ౧౩౬

సీ. మొల్లమొగ్గలసాటి పెల్లగు పల్వాలు
బలుకెంపు మోవిపై ♦ బరుపకున్న

వెడలుపుగలబోర ♦ విడి గుబ్బలంటగా
నింపుమై వే కౌఁగిలింపకున్న
నీటి పుట్టుఁగుబోలు ♦ నీ కేలుదుగలను
చెల్వైన కౌవ్వునఁ జేర్పకున్న
నిబ్బరికపుచూపులుబ్బగ వెల్లనౌ
నెమ్మోముదమ్మిపై ♦ నిలుపకున్న

గీ. నోర్వగాలేను నాయందు ♦ ముర్వుమీర
రమ్ము రావేని యిట నీవి ♦ రాళియగ్గి
చేత నీరైన నిన్వేడ్క ♦ జేసి నీదు
నడుగుదమ్ములకడఁ జేరి ♦ యుండగొందు. ౧౩౭

వ. అని యిట్లు కొన్ని నుడికారంబులఁగు పోలుపొందు తియ్యని నుడులచే వాఁక్రుచ్చి యక్కటివేల్పుం జూచి వెండియు నప్పద్మిని యిట్లనియె. ౧౩౮

క. తొయ్యలి వలుపులు హెచ్చిన
కుయ్యిడుచున్నంత మరుఁడు ♦ కు సిగుంపులుఁగా
తియ్యని విల్లందియు వేఁ
కయ్యానికి కాలుద్రవ్వఁ ♦ గా కటివేల్పా. ౧౩౯

చ. సరవిఁగ వెన్నెలంగనిన ♦ జక్కవతీపుకడిందిముబ్బు పెం
పరసిన తూడుతిండిపరి ♦ నక్కట బెబ్బులిఁగన్న లేఁడిమా
దిరి కడి పూలసెజ్జపయి ♦ తీఁగయొలుఁగున కాఁకునొందెనా
విరిహాదనందు దొట్రిలెను ♦ వెచ్చల కాకల నోర్వలేమిచేన్. ౧౪౦

క. దక్కినపుఁ గాలి వీఁవఁగ
పక్కులు వగఁగలుఁగ గూయ ♦ వలదొర నెలలున్
స్రుక్కగనేసిరి చీమ చి
టుక్కనిసన్ నీవటంచు డొంకుచు చూచున్. ౧౪౧

మ. అనలుం బుట్టుగుసం బఱుండె నెల చె ♦ ల్వారంబో గల్గిక్కి డా
ల్పనతెల్మ్మతైపుచాలుమై కళుకుమేల్ ♦ బంగారుతీవేము తె
ల్పెసలారెన్ సగలెల్ల దమ్మి మొగహో ♦ యిం దాకగాగ్రుక్కి నీ
మనవల్పుండిన గాదె హోవమాల వే ♦ మారుం బడెన్నన్నయూ. ౧౨౨

క. అని హాయొయలుగ నచ్చెలి ను
ద్దినివినగాఁ బలుక నల్లఁ ♦ దేపర యెలమిఁ
బెనగొనగ చెలువతో వా
న్నెగలగల నడికారమపి ♦ నంబలికె మనన్. ౧౨౩

ఉ. మావటి ప్రొద్దుగ్రుంకవిను ♦ మా చెలికానినిఁ గూడి నేడు నే
నా పి బిడారుజేరముఱు ♦ వారఁగ వచ్చెదనంచు దెల్పుమా
చూపరి పూలవిల్తునకు ♦ గ్రుక్కక గట్టితనంబు బూని తా
దూపిలియున్న నద్దమమా ♦ తొయ్యలి మేల్రతనమ్మ గ్రద్దనన్.

క. అని పలికి పోవఁబనిచిన
ననఁబోణికయి న్మొగిడ్చి ♦ నలమేన్దొరకై
గునపు నగిడి గిల్లిడి గ
ద్దనచెల్మి పడంతియున్న ♦ తావలమునకై. ౧౨౪

ఉ. వన్నె యొయారివచ్చి ♦ చెలువంగని ముందటనున్న తీరులే
కున్న వితాకునొంది వెఱ ♦ గొందియు కన్నుల తెప్పవాల్చకే
కన్నియనెల్లఁ జూచి సర ♦ గన్నరసంగల ముద్దుగుమ్మలన్
బెన్నుడి వక్కణించుమని ♦ వేడుకఁజేరిన నందటొక్కతై. ౧౨౫

తే. గీ. వరున వాకొనిరప్పుడు ♦ వఱఁటిమిన్న
కరయుఁ జిగురాకు బాకువా ♦ డనేఁడుఁ బూవి
పోక నెడలోన సెకనేరి ♦ గ్రుక్కి గోడ
గములపాలయి యడిగోలె ♦ కన్నెమిన్న. ౧౨౬

చ. కుడువదు వంటకంబు నెఱి ♦ కొప్పునఁ దాపుల పూవుసోగల
న్ముడువదు రామతమ్మలటు ♦ మ్రోలనుఁ జేరిన నౌరు సుద్దుల
న్నుడువదు పూఁబొదోఁపునకు ♦ నుం జెలిమూకలఁ గూడియాడఁగా
నడువదు గొప్ప యబ్బముఁగా ♦ నచ్చిన నవ్వది కేమి సేతుమో.

ఉ. విప్పదు లోవలం గలుఁగు ♦ వేసట నెమ్మలకెల్ల చిందులన్
జెప్పదు మోముఁ దమ్మికయిఁ ♦ జేఁగవచ్చిన తేటి మొత్తము
ద్రొప్పదు నీకునుం గొనదు ♦ రోయును కోయిలపౌజుకుం గను
ల్దిప్పదు నల్ల మేనుఁగల ♦ దేవర వచ్చెడు త్రోవఁజూచుటల్. ౧౨౯

క. ఈ రమణ నిదుర లేకయె
సారెకు నిటురట్టు సేయు ♦ సాగెనుఁ బలుకన్
మారాడదు మముఁ జూడదు
పేరిమితో నెపుడు నిన్ను ♦ బేర్కొను పడఁతీ. ౧౩౦

క. అని పసఁగఁ జేయు చెలియలు
వినుచు నుడుల నాలకించి ♦ పెనుతోయముగాఁ
గనుమారాడక దనపే
రును వినఁబలికినను వీడె ♦ ప్రోయాలు వెఱఁ. ౧౩౧

తే. గీ. కన్నుఁదమ్ములఁ దెఱచిన ♦ ల్గడలమిన్న
నెల్లఁబరికించి యెడ్డలో ♦ నల్లటంబు
నివ్వటిల్లఁగ నచ్చటి ♦ నేస్తపుఁ జెలి
మూనికంబునుఁ గనుఁగొని ♦ మాటఁబలికె. ౧౩౨

చ. కటకటనన్ను నిట్లుపల ♦ కాఁకను సందరమందు ముంచినీ
వెటకుమిటారి యేగితివె ♦ యెక్కగణిక్ మరులుం దొలంగునె
చ్చటఁజొరుదు న్నిరానవను ♦ సారెకు కౌఁగిలి నీయవెన్నఁడె
న్నటి తరివచ్చునమ్మ విన ♦ నాదగుగంగఁ జెలంగనెల్తుకా. ౧౩౩

ఉ. వెన్నుని చెంతనాకుఁగల ♦ విన్నదనంబును విన్నవించితో
క్రన్నన నిన్ను సేయుమనుమనుఁగ ♦ న్వాని పల్కకమోన పోతివో
విన్నది కన్నయట్లు వినుపిం ♦ చితో నీదగు రాయబారమో
యన్నులమిన్నఁ జెప్పఁదగు ♦ నచ్చోటఁగల్గిన వింతయేర్పడన్.

సీ. అని కఱివేల్పు పొం ♦ దున కయివెతలకు
పాద్వైన కుబ్జనాఁ ♦ బడఁతిఁజూచి
బడ్మని యిట్లనిఁబలికె ♦ కన్నీరుము
న్నీరుఁగాఁ జేసియు ♦ నిటుకాటు
కనుఁగదుఁగఁగ నేల ♦ కసువేడియూర్పుల
వలస పూపోగులు ♦ వాడె సెజ్జ
బూరలఁగా నేరని ♦ పోడిమి విడనాడి
గబ్బిగుబ్బలఁ బూయు ♦ గందములును

గీ. చెదరిపోడిత్రావాలఁ ♦ జెక్కుటఁ జేయిఁజేర్చి
మోముఁ దామరవన్నెలు ♦ మొఱకవడక
చెఱఁగు ముసికిడినిట్టుల ♦ చెల్వకాని
కొఱకు కుందంగ నేటికే ♦ కొమ్మమిన్న. ౧౩౫

క. అని తానుఁబోయికన్న
య్యనుఁ గన్గొని ముచ్చటాడి ♦ యానతిగొనివ
చ్చిన ముచ్చటంత చెలివా
కొని నెలఁతకుఁ దెలిపెఁబూస ♦ గూర్చిన మాడ్కిన్. ౧౩౬

వ. అంతమచ్చకంటితో నిచ్చగా కొన్ని ముచ్చటల మచ్చికగా ముచ్చటించి మఱియు. ౧౩౭

చ. తెలిసితిఁగాని నీవలపు ♦ తెమ్మరవీఁవ మగండుకిన్కతో
నలరుల కోరులేయ చెలు ♦ వారఁగ కోయిలజిల్క సాకెపె

ల్లలమటఁ బొందఁగా రొదలు ♦ వాళిగ సల్పఁగ సైపలేవునీ
చెలువలఁగూడి మేడకిక ♦ జేరఁగ బొమ్ము పరాకువొల్లనో. ౧౩౮

తే. గీ. ఇటుల నేస్తపుచెలిబల్కు ♦ యింతి మిన్న
చెల్మివడఁతుక చేదమ్మి ♦ చేయిదమ్మి
నిచ్చివయ్యెట సవరించి ♦ యెలమిమీఱ
సంచనడకల కొయ్యారి ♦ మించనడచి. ౧౩౯

ఉ. మేడకుఁజేరఁబోయి చెలి ♦ మిన్నలతోఁ గొలువుండు నంతలో
వేడుకకాఁడు నల్లమెయి ♦ వేలుపుకొండొక చేడెఁజేరి తా
వేడిమిగొన్న కుబ్జకును ♦ వేళముగా నిదె రేయివత్తు నం
చాడినగోలె నంతిపురి ♦ నాయమ వీడియు మిత్తిమించగన్. ౧౪౦

ఆ. వె. వెన్నదొంగ రాన ♦ వినివచ్చి కొలువున్న
చెలువకతుఁదు బుట్ట ♦ చెలిమిగలుఁగ
వేల్పుప్రోడఁ జెప్పు ♦ వివరము కారును
దెలియఁజేసి యేగె ♦ తెఱవమిన్న. ౧౪౧

వ. ఇట్లుఁ దెలియునంత నావగలాడి వగకాసక్తై, మిగుల వగలఁబొగిలి తనలోన. ౧౪౨

ఆ. వె. ఎపుడుఁ బ్రొద్దుగూకు ♦ నెఱచి మేపరిగొంగ
నెపుడుజూతు వలపు ♦ లెపుడు దీర్చు
నెపుడు చందమామ ♦ యేతెంచునో కద
యనుచు పలువితాల ♦ నరయుచుండె. ౧౪౩

వ. అట్టి తోయంబున. ౧౪౪

(సూర్యాస్తమయవర్ణనము)

తే. గీ. వెనుకదెస సీమ మేడపై ♦ వేడ్కమీఱ
రేవెలందుక మెచ్చుతు ♦ రీన పసిఁడి

కుండసేసియు క్రొవ్వపు ♦ కొనలనుంచె
నోయనంగను చీకటి ♦ దాయ వెలిఁగె. ౧౪౫

క. పడమర కెలఁకుపడంతికి
కడువడితతి బొజుగుకాఁడు ♦ తలిరుల కెంపుల్
విడివిడిఁ గూర్చిన బంతిని
తడయకఁబంపెనన కలువ ♦ దాయఁడుఁ గ్రుంకెన్. ౧౪౬

చ. నలుకులు నెట్టవాతె చెలు ♦ వంబులు తామరలందుఁ దీరె పు
ల్గులుగమి చెట్లజేరె నెల ♦ కూటిపులుంగుల సేదఁదేరె బల్
కలువలరోకు మీరె నెల ♦ కల్లలదాటుల నీరులూరె చు
క్కల తెగ గేరె కమ్మవిలు ♦ కాడులకోరులనూరె నత్తరిన్. ౧౪౭

ఉ. పేరిమితమ్మితేని వల ♦ పింపగ వెన్నెసయన్నలంతి సొం
పారినఁ చీరఁదాలిచి యొ ♦ యారపుఁ జేటురువాతు కెంపులన్
గూరుచు సొమ్ముఁబెట్టుకొని ♦ క్రొత్తసిజాజుల కొప్పుబెట్టినో
నారహిమీర నేలయెఱ ♦ నైనెఱసందెవెలింగి జొబ్బిలెన్. ౧౪౮

తే. గీ. తుంటవిల్తుండు బొజుగుల ♦ తుటుముగరువ
మణపనన విల్లునెత్తిన ♦ యలరు బెళుకొ
తేరునకుఁ గట్టుచిలుకల ♦ తేటుముక్కు
నీటుచాయల నగనొప్పె ♦ నీరుకాళ్లు. ౧౪౯

చ. కలువబొజుంగునా తెలిమె ♦ కంబుల రాయఁడు వేడ్కఁ బుట్టుగు
బ్బలిగ వినుండిలేచి తన ♦ వాడివెలుంగగు చేతిగోరులన్
నిలువక చీఁకటేనుఁగును నెత్తినఁ ♦ గొట్టిన క్రెళ్లిరాలుని
గ్గులుగల ముత్తియంబులను ♦ కోపునచుక్కలువెల్గె తళ్కునన్.

చ. విరిపిడిఁ బాఱి గుబ్బలిగ ♦ విన్నెఱితావులఁ దూఱియుండి బి
త్తరమునుఁగల్గు ప్రొద్దుతురి ♦ తంబున గ్రుంకుడు మొట్టుఁజేరిన

న్పొరిపురివెచ్చ గాండ్రకును ♦ గ్రుచ్చులకానలుఁ బుట్టఁదట్టగా
నిసులట సక్కిపిక్కటిలె నేర్పడ ♦ నేరక వ్రంత మిట్టుఁబున్. ౧౫౧

మ. వెలియింత్తైనను లేక ముజ్జగములుం ♦ పెంజీకటుల్గ్రమ్మ న
త్తిలలోకన్ గోమ రాండ్రుఁ గొగిన్నగలతో ♦ దారాకుణంగా పూలసె
జ్జలపై గూడి పరుండనేసి మసపై ♦ చన్ మిండఁడంజేరి గ్రం
తలహొ ఋన్మరు చెయ్యులన్మలఁగియుం ♦ తం బో ఋరిల్ జేరఁగన్.

సీ. మరుఁడు దొరపరుల ♦ మది కొనలం గాల్ప
కుప్పఁగా సిల్పిన ♦ నిప్పులనఁగ
విటకాండ్రపై దాడి ♦ వెడలెను వెసరాఁయు
గ్రొల్లైనపై హరొన్న ♦ కుండయనఁగ
వలపుకాండ్రను మొక ♦ ములపైన వేఁటాడ
దెచ్చిన పసపిల్లు ♦ దీపమనఁగ
వలజేఁడు వలఁగల ♦ వారిగాఁ తనుతీఁగి
యులఁ ద్రొంపనెత్తిన ♦ యులరుగుడుసు

గీ. పాలనఁగ యెల్తిదనమయి ♦ వన్నెనున్న
వగలి తేజులఁగలదియై ♦ వ్రఋవయయి
పొడుపుగుబ్బలి కొప్పుపై ♦ బొడిచెనంత
భాజు లలరిన చందురు ♦ డోజఁగలిగి. ౧౫౩

ఆ. వె. చందమామ యొక ♦ సము నెక్కఁ దెసలను
వెల్లఁదనముఁ గలుఁగు ♦ వెలుఁగు లేరు
పడియె సలువ గ్రుడ్డు ♦ వడిగ నిండినకవ్వ
రంబు గ్రోవిపసగ ♦ నంబడియెను. ౧౫౪

వ. మఱియు నవ్పొడుపుకొండనుండి కొమారుండుఁ బుట్టిన వేఁడుకను నాకసము నొరయు తరఁగలచే మున్నుతిల్లు పాలసంగరంబు వెల్లి వాఱిచి పుడమి కడువడి యెల్లెడల నల్లుకొనియెనన నంతకంతకు

లెక్కలేనిదియై యెనిమిదికడలఁ నులుమఁబడి మిన్నేటి సెలయే రులనుండి పైఁడిమూఁగాలి వెలుంగికిం దిగ్గురాయుంచల సోగుల మూఁదిగ తగ్గులేని పుటపుటనవిచ్చిన తెల్లఁగలువల ప్రోఁగులుం గల కేళాకూళులు చెంగటను పొదలాడుచు తెలగాయువామి యును గవియుఁను జొన్నుటయబ్బెసంబునుంబోలె మేడలనొప్పు సుర తాణిఁ తనంపు గుంగ్రని కికికీలింమూఁయుగు చీఁకటి క్రొక్కారు తుక యగుటవలన తెల్లు పెంపారి వ్రాఁచెనోయన విరివిఁగల వెల్లువల నొడ్డులం గ్రాలుచు నసలచాలుల పోలిక నేలపుట్టుఁగుల తీవియల యాకులం దళతళరువాణంబుల వెలయుచు క్రొందమసిం గపు కూసలతీరున క్రొండకొప్రఁబులెక్కుచు మనఁజెలంగ జల కంబునం దేలియాడు వాలుఁగల మేలగు బెళుకులంబోలి సోయ గంబున నందంబుగల పెన్నిటితరగల చెలువారి యులచందిరిక మిక్కిలి గరగరగల తెల్లని చెన్నుగలదియై వెన్నెలపులుంగుల నోట నెరయుచు చంద్రమామసీసులోఁ గల తేటివాయినుండి నెమరువేయఁగ జారిన మిక్కిలి మమ్మతిల్లు నురుగుపుంజిక వరుస నేర్పాటుగల పువ్వుటీరంబులపయిం దిగువులాడుచు కమ్మనితావి వెదజల్లెడుననుచు మల్లెపూగుత్తుల సంతోసంబు రెట్టింప నిట్టట్టు తొలుదొల్త కూడికచే నలసి వలపుకాండ్రను నీసడించు పైకూ టమి నెఱుపుతెఱవలఁ సుగిలుజాలుమసన్నరువాణంబుల తెఱం గునన్ కురంగట కరంగి తొరఁగు నెలకల కట్టడంపు నేల జలజలం జాఱుచుండు వెల్లఁడనంపుఁ దేటి తళుక్కులం గలసి కూడుకొనుచు రింగున న్నొగసి వినుదారికంగారు నేల కొండుకుగాముపగడంపు రిక్కలు గోలెగాములు రిక్కలింగంబులసి గుటుకు గుటుక్కన మ్రింగ గడంగుతఱి పెద్దగా గుదియుమనుచు వెల్లువ వరుస నీటి దారకు నింపుగా గుంపులై యాకసంబున కుత్తుకకోలఁది ద్రావి

క్రిక్కిరియున్నాఁబట్టి యొక్కటి కొక్కటి కందిచ్చుచు విచ్చలవిడిన మచ్చికలం గలయు వెలఁదావుల నొయ్యారంబును నాలుకలు పటికపుఁగోరల నొమ్మెనలుంచిన నాగకడసు కల్లునా సచే బుచ్చుకొని దాని రిమ్మవలన గలుగుకొన్న సంతోసంబు సంగడింప వినువారి వీనుల కింపగునటుల బాడు నెక్కువతక్కువ పాటలచేత దబ్బాటుగాటల సక్కజంబు పొందించు నాటలచే వంకరలగు రూపుసేతల లలించు వైనములేని చిరునవ్వులం జెలంగి మెలఁగుచు తెలివంటు పరాకు వదిలి మరలుఁజెంది నొకరి కొకరు ప్రేముడిసేయుచు రతినపుటందియలు మ్రోఁతమ్రోఁయఁగా పుప్పపు పెద్దగుప్పలకుం బోయి తోటనుండు కమ్మతెమ్మరలు వీఁచి, కుతినీపయ్యెదలు దొలంగింపకయున్న జారిపోవ న్నసుపు పచ్చని సమ్మకాయలనువునం బొంగారు లేకులుకఁగుబ్బ గవలం దళతళలాడునట్లు గాన్పించు సొగసైనపొడ లుబ్బుకొనం దబ్బిబ్బ లెడలం దబ్బుప కౌఁగిలించు మెఱుఁగుఁబోఁడుల కన్గవలకొనల గదలుచున్న మెఱుంగులు రాణించు సింగారపు సేతలకు సంతసించు ప్రేముఁడి మగలతో పెనుగులాఁడి వలువితంబుల కూటములన్ గల నేరుపులతో చేరి మునునిదురంబున సయ్యాటలాడి తారుచుండు నవ్వుడు సోయగంబుచే తళతళక్కుమని గ్రాలెడు మగరాలదుద్దుల పాపెటఁ బొట్టు చకచకలతో చెలిమిసేయుచు నిట్లు తగ్గులేని తెల్లని చాయలు నించుకొని మెండుగా పండువెన్నెలలు గాయుచుండ మరుండు కరంబుగా విరికఱుకుటమ్ముల దురమ్ము సేయ కినుకారదాయుమై కమ్మతెమ్మెరలుదాయ నుల్లంబు జల్లుజల్లుమని తల్లడిల్ల సిద్ధురనొందక మిగుల మొత్తని జిగురుపాన్పు నుండి డిగిచెరలాడు పెనుగాలిచే దూలి పూఁపతీఁగియమాదిరి సోలుచు కుబ్జకన్నె కరతినంబు సతంబు మంతనంబున తలంపు

సేయు సిరిపెనిమిటియగు కన్నయ్య యొడలి సింగారంబు కన్నులఁ గట్టినట్లైనఁ జూచితి చూచితని జగురునలేచి బయులం గాఁగిలించుచు నది నట్టిదియైన కళవళించుచు నక్కటక్కటా మాల దైవంబు కట్టడియయ్యె నేనేమి సేయుదుననుచు కన్నుంగవనుండి జారుచున్న నీరు పెల్లమై యలర గడగడ వడంకుచున్నంతలోన.

ఉ. అప్పుడు నల్లమేనిదొర ♦ యూరటమొందెడు కుబ్జచెంతకున్
దెప్పునఁబోవఁగాఁ దలఁచి ♦ తీరగుసొమ్ములుఁ దాల్చి మేననీ
టొప్పఁగ యుద్ధవుండనెడు ♦ నొక్క నిమిత్తునిఁ గూడిచేడెమే
లుప్పరిగంబుల్గ్రోవచెలు ♦ వొందగ నాతఁడుఁదియుచుండగన్. ౧౫౬

క. చనిచని కట్టెదురంగను
గొనెమరునిం గన్నతండ్రి ♦ కోల్కొను సొరము
ల్దనలారు పీనవిద్దెన్
జిగిరవల వెలుంగుగద్దె ♦ చెలువఁగు మిద్దెన్. ౧౫౭

వ. కనితోఁ గిలికింజనిన నచ్చేడియ యెదురుఁగా నడచి హారునంబు బుద్ధితో బెనంగొన నక్కటివేల్పునంజదమ్ములు వన్నిటి జలకంబు నంగడిగి సన్నని దువ్వలువచే దడియొత్తి నిద్దాబంగరు రతనాల గద్దియపైఁ గూరుచుండబెట్టి వెంబడించివచ్చిన యుద్ధవుండనెడు నేస్తకానికిఁ దగిన పూజలొనరించి దురబందులు మొదలగు మేలొగిరంబుల సాపడంబెట్టి నెచ్చెలులతో నచ్చెలువ యూరగించి మరియు, ౧౫౮

క. జవ్వాది కప్పురపుకడి
నివ్వటిలం జెమ్మలందు ♦ నెటిదివ్వెలతో

మవ్వముఁగల పడుకఁగదిన్
జివ్వన కరి వేల్పుతోడఁ ♦ జేరె చెలువయున్. ౧౫౯

వ. ఇట్లు నవ్వుడుకఁగది ప్రోలకరిగి వెండియు, ౧౬౦

చ. పగడపుకోళ్ల మంచమును ♦ బఱ్ఱిటి సీపనిమించు పాన్పుపై
నిగనిగలాడు దోమతెర ♦ నిక్కఁగచక్కని నిల్వుటద్దము
ల్సొగసగు మొత్తలుస్వరుల ♦ సూదినిచందువ ముత్తియంపుచే
ర్లుఁగలిగి తేజునొందుఁ బలి ♦ లోగిలికిఁ జని చూచిరప్పుడున్. ౧౬౧

సీ. మంచిగందపుకోర ♦ మరిజాలవల్లిక
వట్టివేళ్లనురంటి ♦ వన్నెగదుర
జవ్వాదివక్కణి ♦ సంపెంగినూనె గిం
డులుఁ బిల్లిగడ్డలు ♦ తళతళమను
సిరిమించు రతనాల ♦ చిలుకల డివ్వెకం
బంబులు కప్పుఁ ♦ బరణివచ్చి
కస్తురి పెట్టెయు ♦ కాళంజికడిగల
పన్నీటిబ్రోవియు పసిఁడిపీట

గీ. బలితమగు నేన్గు పలుతోటి ♦ పనిదనర్చు
దువ్వెనక డానిచెంబులు ♦ నివ్వటిలిన
పడుకటిలుఁ జూచి కన్నుల ♦ పండువైన
పచ్చరామెట్లుఁ గలపూల ♦ పాన్పుఁ జేరి. ౧౬౨

శా. దయ్యంబౌఁ కజివేల్పు కుబ్జమొదనే ♦ దందీర కేల్దమ్మిలో
నొయ్యారంబు నకౌఁగిలించి తమితో ♦ నోజన్నునుం బల్కులన్

వెయ్యార్లాడుచు సోబియంబు గులుక ♦ న్వేఁదిచ్చు విల్దారిమేల్
కయ్యంబున్వివరింప మెచ్చుకొనియె ♦ న్గాదారి మాందారిలోన్.

క. పొక్కిలిచన్నవ కుత్తుక
చెక్కిలికెమ్మోవి కనులఁ ♦ జెల్వపుమోమున్
నిక్కువముగ ముద్దులుఁగొని
చక్కగ తమయిచ్చనుగముఁ ♦ జరిపెను తెలలో. ౧౬౪

చ. సరివయికూటమిం జెలువ ♦ నల్పుచునుండఁగ వింతవేలుపుం
దెరవసియాడె చుక్కలొగి ♦ తిన్నవవీడ్వడి చిక్కులొందె నం
బరమున గట్టులున్వడికి ♦ బల్మరుచందురుఁగప్పె క్రుబ్బుల
చ్చెరువుగనీరుబొట్లువడి ♦ సెన్నలితిమ్ముఁలుమించెనాడుచున్. ౧౬౫

తే. గీ. ఇటుల పలువితాల ♦ హెచ్చుగ వలపుల
కలయికలనుఁ దేలి ♦ కలికికతిచు
మేనివేల్పుతోడ ♦ మెత్తని నడుపుల
చెంగనాలుదాను ♦ జేసిపలికె. ౧౬౬

తే. గీ. నీదుచిట్టంటువుల చేత ♦ నీదుమేని
వలపులకు నాదుడెందంబు ♦ వరగలించె
నన్నికోరికలీయక ♦ న్నయ్య తగును
వేరువేలుపు లిట్లుగా ♦ వింపఁగలరె. ౧౬౭

మ. లలియా నీయొడలిం దలంచి సిరివా ♦ లాయంబు నివ్వేడు కెం
దులకో నేనిమునంబు నిన్నువిడువన్ ♦ తోరంపు పూవిల్తు విం
దులలోనిండిన వేడ్కఁజూపి వలపు ♦ ల్దోఁగియంగ నీ కల్మికిన్
దులలేదే వివరింపగా నలవియే ♦ వోడ్పోద నీ సత్తువన్. ౧౬౮

తే. గీ. కానవేఁ గోరుకోర్కెలఁ ♦ గలుఁగఁజేసి
మనువుమని వేఁడుకొనెనన ♦ మారుపాటు
నొందియడిగిన కుబ్జను ♦ డెందమందు
కట్టిమనుమఁడు రుసికి న ♦ క్కజముఁగనెనె. ౧౬౯

ఆ. వె. పోఁరతిండి తపసి ♦ మొదలుగాగల రసు
లెదనుఁదలఁచి చూడ ♦ కుదురులేని
వేల్పు నెట్లుగోరె ♦ వెలఁదుక విరివిల్తు
పోరఁగవయు నట్టు ♦ లోరుసిలలి. ౧౭౦

క. దొరకఁడు సిరికౌఁగిటిలో
దొరకండలఁ జోగికలువ ♦ దొరలకు నెపుడున్
దొరకఁడు వేల్పులకైనను
దొరికెన్వలరాయు తండ్రి ♦ తొయ్యలికి నోగిన్ ౧౭౧

క. తొలిచదువుల కందసియా
తొలిమాసపి జేజెజేజె ♦ దొరికిన యంతన్
డెలివిఁగల ముగితెఁగోరక
నలరాచ పనిన్మెలంగ ♦ వలెనని గోరెన్. ౧౭౨

ఆ. వె. పిల్లతనములోన ♦ పెంచిన తల్లిచే
కట్టుబడిన యట్లు ♦ కనికరమున
లేమకౌఁగిలింత ♦ లోమిన్నమైఁ జిక్కె
నేమిపునెమొ తొల్లి ♦ నోములేనో. ౧౭౩

ఆ. వె. ముజ్జగంబులేలు ♦ ముప్పోకలానిని
కోరుకున్న చెలికి ♦ కోర్కెలిచ్చి

గాచుకొనెనొ లేక ♦ కసటునమ్మించెనొ
తెలియఁబలుకు మనిసఁ ♦ దిరిగిచూడవె. ౧౭౪

ఉ. నీ వనుమాటలన్నియనిన నిక్కము ♦ బత్తులబత్తి నెడ్డలో
గావఁగ నీవెయుంచనెదు ♦ కర్పనమున్నవి నంతలోపలన్
జోవకయుండునే యతని ♦ బుద్దిఁ గల్గిన కోర్కెలీయకే
దేవరయుండు నేమనకు ♦ తెల్లముగావలవేల్పు చెయ్యముల్. ౧౭౫

ఆ. వె. ఔరవాని చెట్ట ♦ సమరఁగఁ బట్టిన
గొల్లకన్నెకలును ♦ గొనిరి మగిది
యతఁడు కేలబట్టి ♦ సతముఁ బ్రోచెను వారి
కరయ కలుసమున్న ♦ వలనుఁ గలదె. ౧౭౬

ఆ. వె. చుట్టమయ్యెఁగాని ♦ నూడు చేతనుగాని
కలఁతనైనఁగాని ♦ కలసిఁగాని
బగితినైనఁగాని ♦ బల్మొరువానితో
పొందుసేయఁగలుఁగు ♦ ముందు మగిది. ౧౭౭

క. మునుకలపమియ్యౌ తనుదా
ల్చిన ప్రేముడి పెను కులాడ ♦ చినిమగపనిలో
తనిసననుండు మటంచని
వినిపించిన సంతసించి ♦ వెన్నుడు వేడ్కన్. ౧౭౮

ఉ. కోరినకోర్కె లిత్తునని ♦ కుబ్జ యువెన్నుఁడు నిండువేడ్కఁ బెం
పారఁగ బల్సుగంబులను ♦ హాళిసెలంగఁగ గబ్బిగుబ్బలన్
బోరున నంటకౌఁగిలిడి ♦ పూవిలుకాని దురంబునైనయున్
మేరలచాలఁ దెల్పిచెలి ♦ మిన్ననుఁగూడి పరుండె నంతటన్. ౧౭౯

చ. కలువలు మోముమూసె కడ ♦ గండ్లకుతావగు చందమామపు
ల్గులమదిరోసె, జక్కవల ♦ గోడులఁబోవిడి గ్రేణిసేసె చు
క్కలగమిమాసె, తామరలు ♦ క్రన్నఱఁబూసె, బిరానకోడిగుం
పులఁ దమిఁగూసె పక్కులట ♦ పోఁడిమి చెట్లనుఁబూసె నంతటన్.

మ. కులుకున్నిద్దపు చెక్కులన్మొనయు ♦ నొక్కుల్ వేసలిన్రాచిత
మ్ములమొల్తాపుకిలించి బోకముదులం ♦ బొంకంబుగా గట్టిని
చ్చలు సొంపొందఁగ ముంగురుల్నిమిరియు ♦ చ్చన్నంకియుం గోరన
త్తులబీతిన్వారి పొన్పులండిగిరి తేం ♦ డ్లంచాలులేయంచొగిన్. ౧౮౧

తే. గీ. పాయమును గల్గుకమ్మిమే ♦ ఱ్రాయని మది
మెచ్చెరే రాజువినుచెలి ♦ మిన్నముదుక
డనుచు క్రిందుగ బడద్రొబ్బి ♦ నట్లుమామ
వాఁ్రిలెపడమటి కొండపై ♦ బాజులెడలి. ౧౮౨

క. గందపు మలనెత్తమ్ముల
కందువమేత్రీవముండ్ల ♦ కడివిరి పొన్పున్
జెంది సుగించిన చెంచుల
యందపుచన్గవ జవాది ♦ యంది సురలొగిన్. ౧౮౩

క. తారాడుచుండ పజలను
కూరుకు విడనాడి మేలు ♦ కొనుటకు తానే
కోరికలేపెడు వాడన
తూరుపుఁదెస వేఁగుజుక్క ♦ తురుతునఁ బొడిచెన్. ౧౮౪

తే. గీ. బమ్మచారులు మొదలైన ♦ బాపలెల్ల
మేలుకాంచి నతంబును ♦ మెలఁగదగిన

నేతలను తానమాడియు ♦ నేమములర
నందెగిడిగిళ్లు సలిపిరి ♦ సరిఁగబగితి. ౧౮౫

తే. గీ. చెలియకుబ్జను కన్నయ్య ♦ చేరిమరుని
రాతులనుదెల్పి నిమురించె ♦ రానఁజెలఁగ
మేఁకొలుపఁగఁ దగునని ♦ మించివచ్చి
కొక్కొరకొయంచు కోళ్లటఁ ♦ గూసె పెలుచ. ౧౮౬

ఆ. వె. వినుతకొడుకుఁ గలఁగ ♦ వెలసిన యరదము
తోడసిరివెలుంగ ♦ తొడరు బాయ
నందితూర్పు కొండ ♦ నలరె ముప్పోకల
తారుచున్న వేల్పు ♦ తళుకులెసఁగ. ౧౮౭

ఆ. వె. ప్రొద్దుఁబొడువ తమ్మి ♦ పొక్కిలి మేల్కాని
తానమాడుపనుల ♦ తమకమునను
దీర్చి సుగముగదుర ♦ తిరుగుచు లేకల
గమినిఁబ్రోచు చుండె ♦ గారవమున. ౧౮౮

చ. కుమరితయైన కుబ్జయెదఁ ♦ గోరినయట్టుల వెన్నుఁడొంగ వ
చ్చి మరులుమాన్చి యింటఁబనఁ ♦ జేసినకోమలు డెంతొపెద్దవే
డ్కమది జెలంగ బత్తిమెయి ♦ కారును గప్పుచు సంతసించియుం
డె మరుని గన్నతండ్రి క ♦ డిందగు వేరులనెంచి నెమ్మిగన్. ౧౮౯

మ. ననకుండు న్మొదలైన జోగులెదలో ♦ నంతోసముంజెంది చూ
చినఁ గానంబడనట్టి వేల్పునకుఁ దా ♦ చేదమ్ముల్మలం గల్గుచ
క్కని గందంబుల నిచ్చినందులకు వే ♦ గన్వచ్చి మన్నించె క్రొ
న్ననవిల్దారిగలంచి నెల్తుకనురా ♦ నం గొన్నినాళ్ళుండియున్. ౧౯౦

చ. ఇటువలె కుబ్జవెన్నునకు ♦ నేడ్తెఁబొనిసె చెయ్వులెల్లయూ
రటఁగొనకే యొనర్చుచుత ♦ రల్పగ సత్తువలేని బాగముల్

బటువుగనొంది పాటలర ♦ వాళులు హెచ్చఁగ సెజ్జగీములో
చిటిపొటిమాట లన్నొగని ♦ చిక్కనిరంతులఁ జిక్కియుండఁగన్.

క. ఏ వేసట లేకుండఁగ
పూవిల్తుని పోరులోనఁ ♦ బూవిల్తునకున్
బూవిల్తుఁడైన కన్నయ
తో వేడుకనుండె కొడుకు ♦ తొరలుట కొఱకై. ౧౯-౨

సీ. కన్నయ్యనిబ్బరి ♦ కప్పుఁజూపులో కుబ్జ
పడఁతికి దనరొక్క ♦ పాలువలన
మంచికారున నెల ♦ మనలెనుగొంతికి
మోమున తెలుపెక్క ♦ ముదుతవిప్పి
బొజ్జను తడఁబడె ♦ బుడిబుడి నడుకలు
కోర్కులు మెండయ్యె ♦ కులుకులెడలె
బోనముపై యిచ్చ ♦ బొత్తిఁగ లేదయ్యె
చిట్టుముల్బలిసెను ♦ చిట్టుకముఁగ

గీ. వంగడము నిల్పుటకు నయి ♦ వగలుచున్న
కొమరితనుఁ జూచి కమలియు ♦ కోమలుండు
సంతసంబను సంద్రము ♦ నోంతొనోల
లాడిరి నెలంత వేవిళ్ల ♦ తోడ మెలఁగె. ౧౯-3

వ. ఇట్లు తొమ్మిది నెలలు జరుగునంత నొక్కసోబన మూరుతమ్మున గాములు తమతమ సొంతపుతావులను మూడాసువదనకొండ వతానకంబుల కొందరుండ నొక్కకొమారుండుఁ గలిగె నతనికి పెద్దల నొడ బాటుచే నువశ్లోకుండను పేరుతో నలరారె వాడుఁ దన తండిరియైన కన్నయ్య యడుగుఁదమ్ములఁ గొలుచుచు నా ర్వేరపురుసిచందురునకుఁ జట్టె బానిసముఁ గావించుచు మిక్కిలి

యక్కజంబుగాఁ దెలియంబడగిన తెలివినిఁ దెలిసి యతం డాఁడు వారిని నాలవకోలంబువారిని బానిసె మొదలగు పజలనుఁ జక్కఁ జేయఁదగినదియై మిక్కిలి తలంచినంతనే ముగితిం గలుఁగనేయు నట్టి (సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి) యనెడు పొత్తముఁగలిగించె. నది మొదలు నేటివరకు కన్నయ్య బగిలిఁగలవారికి విడువరాని పాడియై నలరారె. కావున నీ కతరతనము నేరికైన నుడివిన నుడువగవినిన చెప్పించిన బాగెముఁగలవారికి వెన్నుండున్న మెల్నాడు గలుగును. ౧౨౪

ఆ. వె. అనుచు శుకుడుకత్తె ♦ మనుమనికిని కుబ్జ
కతను నునువులైన ♦ కమ్మనైన
నుడువులదరఁజెప్పె ♦ కడు పరితుష్టుండు
చెవులు చవులునొంద చెలఁగిదెలిసె. ౧౨౫

క. సోబనములు నరసింగా
సోబనములు వేల్పుగొండ ♦ సుద్దిగలబసా
సోబనము లచ్చితేడా
సోబనములు వేల్పుపెద్ద ♦ చూలిపొగడ్తా. ౧౨౬

చ. అడుగులజాలుకుందనపు ♦ టందపుసాలుకతిందిముత్తికం
బాడవగుప్రోలుతమ్మినెల ♦ పుంగలనెత్తుకయాలుఁబత్తులం
గడువడిఁబ్రోచుకేలుబరి ♦ గండడగించెడు చుట్టువాలుమై
బెడగుల ప్రబ్బుడాలు గల ♦ ప్రెగ్గడరక్కసిమార్తిసింగమా. ౧౨౭

(తోటక వృత్తము)

తోగకంటువు కం ♦ దుడుదేవరలు
న్బొగడ న్రితనం ♦ బుల శోణిమనం
దగువేలుపు గొం ♦ డను తానకమై
మిగుల న్వోలిఁజిమ్మి ♦ న మేల్చిర్పుదా. ౧౨౮

(౧౯౬.౯ విక్రమార్కశకం)

క. కననవవర్ణ వశశిసం
ఖ్యనిగుడఁగల విక్రమార్క ♦ హాయనమున సా
గెనుకీలకమాఖ్య సితచతు
ర్థిని నీకవితను ముగించి ♦ తిని మెచ్చ బుధుల్. ౧౯౯

(గద్యం.)

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగస్తనస్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘల్ చక్రవర్తుల రంగయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతంబైన
అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసం
బను సింగారకబ్బంబు నందు
తృతీయాశ్వాసము సర్వం
సంపూర్ణం శ్రీకృష్ణ।
పరబ్రహ్మణేనమః
శ్రీమతేరా
మానుజా
యన
మః

